శ్రీ పరాంబాయైనమః.

శ్రీలక్ష్మీనృసింహ చరణకమల సేవానిరతులును,
ఆంధ్రగీర్వాణ సంగీత సాహిత్య విద్యాప్రవీణులును, నగు
బ్రహ్మశ్రీ వేదమూర్తులైన గుండుఅద్వైతబ్రహ్మశాస్త్రులవారిచే
రచింపబడిన

# * సత్రాజిత్తు నాటకము *
లేక
# * సత్యభామాపరిణయము. *

ధ్రువనాటక, కుసుమకోమలినాటకాది ప్రబంధరచనా
చమత్కారధురీణులైన శ్రీ వేదమూర్తులైన
ధూళిపాళ కృష్ణకవివరుచేత
సకలదోషనివారణంబుగా బరిష్కరింపబడి
గ్రంథకర్తగారి ప్రియసోదరియును, యీ గ్రంథముయొక్క
స్వాతంత్ర్యాధికారమును గ్రంథకర్తగారివలన పొందిన,
శ్రీవావిలాల వేంకట్రామయ్యగారి భార్య
శ్రీవావిలాల రాజ్యలక్ష్మమ్మగారిచే

విశాఖపట్టణములో
మహారాజశ్రీ కొచ్చెర్లకోట వేంకటరామస్వామి పంతులవారి
స్వకీయమగు ఇండియన్, లా, పబ్లికేషన్, ప్రెస్‌లో ముద్రింపించి
ప్రచురింపంబడియె.
1887
మొదటికూర్పు.



వెల ౮ అణాలు.
ప్రింటర్; శ్రీరంగం సీతారామయ్య.

# శుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| లింగార్చన | ౧౦ | కూర్చు | నేర్చు |
| ౧ | ౧౨ | సింహ్యు | సింహు |
| ౩ | ౫ | క।మ | కు।సు |
| ,, | ౧౬ | స।కదం | సక।దం |
| ౫ | ౮ | రూపక | జుల్వ |
| ,, | ౨౪ | పట్లార్ | పట్టార్ |
| ,, | ౨౬ | కుల | కులుస |
| ౬ | ౯ | పాథోవి | పాథోధి |
| ౧౩ | ౧౮ | కాలి | తన |
| ౧౫ | ౨౫ | నసువు | యసువు |
| ౧౬ | ౨౮ | పురహః | పురహం |
| ౧౭ | ౧౪ | యమునాకళ్యాణి | ధన్యాసి |
| ౧౯ | ౨ | నె | యె |
| ౨౩ | ౧౬ | నిలువ | [illegible]లువవ |
| ౨౪ | ౧౯ | మూమక | కోమలి |
| ౨౫ | ౧౪ | భా।ర | భార। |
| ౩౧ | ౨౭ | దనంతరం | తదనంతరం |
| ౩౨ | ౨౩ | ముల్ | మ్ముల్ |
| ,, | ౨౪ | యున్న | యన్న |
| ౩౪ | ౫ | ప్రియ | ప్రేయ |
| ,, | ౨౩ | దెజ్పి | దెప్పి |
| ,, | ౨౮ | కందార్థం | కందం |
| ౩౫ | ౭ | పాతృ[illegible] | [illegible] |
| ౩౬ | ౨౮ | కున్నను | [illegible]న్నా |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౩౯ | ౧౦ | నిగు | నిగుహ |
| ౪౧ | ౨౮ | విన | విని |
| ౪౨ | ౬ | ౮ | ౯ |
| ౪౩ | ౧౨ | వత్యంబు | పత్యంబు |
| ౪౪ | ౧౫ | యుతుడు | రతుడు |
| ౪౫ | ౧౨ | మానుగనిటవచ్చి | మామదికిన్దోచు |
| ,, | ౨౪ | యే | నే |
| ,, | ౨౬ | అప్త | ఆప్త |
| ౪౬ | ౫ | సుఖారి | సురట |
| ,, | ౬ | మణిసిం | మణి।నిం |
| ౪౮ | ౭ | న్మ | న్ము |
| ౪౯ | ౬ | బిసుర | భిసుర |
| ,, | ౧౩ | దీన | దీని |
| ,, | ,, | బి డి | భిండి |
| ,, | ౧౪ | యముని | మట్టి |
| ౫౦ | ౯ | శ్రీకృడ | శ్రీకృష్ణుడ |
| ,, | ౧౦ | కను | వక |
| ,, | ౯ | ల్ | లు |
| ,, | ౧౪ | వల్లె | వల్లే |
| ౫౧ | ౭ | సురునిగాది | సురుగాది |
| ౫౨ | ౧౧ | తృ | త్రు |
| ,, | ౧౧ | ని।నెమారుకొంటినే | నినె।మారుకొంటినె |
| ,, | ౧౫ | తృ | త్రు |
| ,, | ౨౩ | ఫజ్జ | జుజావంతి |
| ,, | ౨౭ | మా | మయూ |

# శుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| ,, | ,, | శం | శర |
| ,, | ౨౯ | తో | ... |
| ౫౩ | ౨౬ | మ్మ | మ్మా |
| ౫౪ | ౩ | శాయ | సేయ |
| ,, | ౧౧ | శ్య | శ |
| ,, | ౧౨ | కృష్ణుడిప్పుడరు | శౌరివచ్చునని |
| ,, | ౧౩ | దెంచు నిజంబునిజంబు | జంబునిజంబునిజంబు |
| ౫౫ | ౨౧ | స | కృష్ణ |
| ౫౬ | ౬ | లక్ష్మి | లక్ష్మీ |
| ,, | ౭ | కె | కెం॥ |
| ,, | ౧౫ | ర్య మొ | ర మొ |
| ,, | ౨౭ | సం॥ | స॥ |
| ౬౦ | ౧౯ | చెలు | చెలులు |
| ౬౧ | ౨౪ | యలు | ములు |
| ౬౨ | ౮ | లు | ల |
| ౬౩ | ౧౫ | యే | నే |
| ౬౪ | ౧౫ | కృషు | కృష్ణు |
| ౬౫ | ౫ | నరగి | నరిగి |

ఇంక నుండిపోయిన యితరవాటిని సవరించుకొనదగు.



దు శ్రీ పరాంబిక భక్తశేఖ రుం
దు రహి వాసుదేవపరబ్రి ష్ఠ
శా స్త్రీంద్రులనుపమా ష్టావధా నా
బి క ర్తవారియందగ్రిజవీరమాంబి క గ
నె లలన లన్ సుతులను లలితముగను శ్రీల క్ష్మి నర స
ష్ట శ్రీస ర స్వతి సోమిదేవిబ్రహ్మేశ్వ రిదివ్యచరిత స వనంబు
స ల్పిన సావిత్రి సోమిదేవాంబయు జగదాంబ వర గు
ణా ఢ్యరాజ్యలక్ష్మమ్మయురమణి శ్రీమహలక్ష్మి సకలసం ప
ద లతో సౌఖ్యమొంద బ్రహ్మణ్యుడద్వయ బ్రహ్మశాస్త్రీంద్రుండు సూర్యనా రా
య ణ
సో మ
యా జి వా సు దే వా
ఖ్యలవసుధలో బరగుదురందులోనగ్రజుండధిక భక్తిదనసతి బుచ్చమ్మయను సు
ర క్తి స లు పం గ
సు రు
బి

రమంగళగిరి శునకును । దీనికృతిగనొసంగెనుధీయుతముగ । కాముకాయన
గోత్రుండు శ్రీముకుంద।స్వామిపుత్రుండు హరిభక్తసమితికె
ల్ల। ప్రేమజనియింప నతులసంప్రీతితోడ॥

# శుభమస్తు అవిఘ్నమస్తు.

# సత్రాజిత్ నాటకము.

## సత్యభామాపరిణయము.

—o:(0):o—

శా॥ శ్రీ కల్యాణన గోపరిష్ఠలమునం శ్రీ లోలతన్ లీలతన్। నా
కారి వ్రజమేర్చి హేమకశిపుంనా। మంబడంగించియు। ప్రాకారంబు
డిగింపగాను విబుధప్రాసంగముల్గాక దా। సాకల్యంబయి శీతలంబుగా
ను నక్షత్రుల్ ప్రశంసించెదన్॥ * * * *

ఉ॥ దాసులు జేయు శీతలము తత్పరతం గొని కామితార్థముల్।
వాసినె మెసంగుచున్ మిగుల వన్నెదలిర్పగ తుంగశైలాద్రిసం । వాసము
నంగభక్తుల కవారిత శేషము నందజేయుచున్। శ్రీసతితోడఁగూడు నర
సింహస్వాలొసంగు నభీష్టసిద్ధులన్॥ * * * *

శా॥ అక్షీణోద్ధతి పాలకుప్పదరువన్ ఆవిర్భవంబందిద్ర్య। గ్వైక్షే
పంబుల। నెల్లవారలుగనన్ విస్ఫూర్తిన్ నిండింపగా। నిక్షేపంబుల నిచ్చు
చున్న సిరివాగ్నిత్యత్వముజ్ఞాపితు। ద్దీక్షాగ్రంథము బూతిన్ జేయుత
కృపన్ దివ్యద్వచో వయిఖరిన్॥ * * * *

సం॥ ద్వి॥ వినరయ్య మద్వంశ విస్తారకథను। యనుపమ కౌము
కాయనసగోత్రుండు । గుండువంశమను దుగ్ధోదధిశశియు। ఖండధీని
ధియు వేంకటనృశింహార్యులకు। పావనుండనబుట్టె భక్తిపరుండు। ధీవి
శేషుండు సద్విద్యాధికుండు। గురుతర వేదాంత కోవిదుడమర। సరసచ
తుర్వేద సారవిదుండు। సర్వసాహిత్యాంధ్ర శబ్దార్థగురుడు। నిర్వ
హితానందనిత్యపూర్ణుండు । సూర్యనారాయణ సోమయాజుండు
భార్యగాను వరించె బహుగుణశాలి। సుదతిసరస్వతిసోమిదేవమ్మ। కుద
యించిరప్పయ్య యనునలయజ్ఞ నారాయణాభిధానములతో నొప్పి

ఆరయగావారికవరజుడయిన। సన్నుకుందస్వామి శాస్త్రి వేదాంగవిన్మ హాజనులలో విశ్రుతుండగును। ననుకూలవతి వీరమాంబికసాధ్వి। వన రుహాయతనేత్రి వయిభవగాత్రి। వినయవిజ్ఞానాది విధికిసావిత్రి। యను పమానశాంతికంచితధాత్రి। పతిభక్తినేప్రొద్దు ప్రకటింపుచుండు। చతురత పరమార్థ చారియాధారి। వరియించెనట్టిపావన శీలయం దు। వరగుణుడద్వయ బ్రహ్మణ్యశాస్త్రి। సూర్యనారాయణసోమయా జుండు। నర్యమసమతేజు డతులగుణుండు। రహివాసుదేవ పరబ్రహ్మ శాస్త్రి। విహితగతింబుట్టి పెరిగెదమందు॥ * * *

స్రగ్ధర॥ అద్వైతబ్రహ్మశాస్త్రిండను కవివరుడ౯ ఆత్మవిద్యావిదుం డ౯। విద్వద్గణ్యుండనయి నావిమలమతిగురుం బ్రీతిభావింపగానాహృ ద్వీథిన్ దోచెల। శ్రీమహృదయ ధనహరుండిద్ధ కౌసేయ వాసుం। డద్వై తజ్ఞాన రూపుండగునరహరి నేనంతటంభక్తిజేయ౯॥ * * *

ఉ॥ సంతసమందితిన్ మిగుల సాదరమొప్పగ సత్యభామనాత్యం తము దంబునంగొనిన యాకథనాటకమందు నాదు స్వాంతము రంజిలంగ కృతిచారుతరంబు మదంకితంబుగా। సొంతమెలర్పజేయుమ నసారెకుమొక్కుచు నుండ వేడుక౯॥ * * *

ఉ॥ అంతటనిద్రమేలుకొని యాహ్నికముల్ ముదమొప్పదీర్చిశ్రీ। కాంతుని యాజ్ఞచేవిహిత కాలమునందున నాటకక్రియా। సొంతమెల ర్పనమ్రతను సాముజవస్త్రినుతించి విశ్వసృట్కాంతకుమొక్కి గ్రం థమొగిగాన రసంబుగజేయ బూనితి౯॥ * * *

* నాటరాగము జంపెతాళము. *

మేళరాగం దరువు.

జయసుధాబ్ధిశయాన। జయకనకపరిధాన। జయలోకపావన। జయగ రుడగమన॥ జయ ॥ ౧ ॥ జయసుగుణగణదీప। జయసుధాశనపత। జ యత్రిభువనాధ్యత। జయదనుజశిత॥ జయ ॥ ౨ ॥ జయలక్ష్మీనరహరీ।జ యదాసముదలహరీ। జయపాతకవిదారి। జయగోత్రిధారీ॥ జయ ॥ ౩ ॥

## * మేళగింపు మంగళము. *

### పంతువరాళి ఆది-

మాలక్ష్మీనరహరికి మంగళం। తులసీ। మామమోహరునాకూ మంగళం॥ మాల ॥ ౧ ॥ పరమ... నునకు । పాథోధిశయనునకు। మరవంది తపాదునకు మంగళం శ్రీ ॥ మాల ॥ ౨ ॥ అంగజాజనకునకు। సంగర హితునకు। శృంగారవేషు... మంగళం॥ మాల ॥ 3 ॥ గోత్రావనక్ర మునకు । కుటిలవిక్రమునకు మాత్రివిక్రమునకు మంగళం శ్రీ ॥ మాల ॥

## * నాదనామక్రియ రాగం. *

### ఆదితాళం-

అజముఖాదిత్యులు। విజయముగోరిముందు। భజనమొనర్చు గణ। పతినిను తింతురా॥ ౧ ॥ కరినిభోద్ధనట్టిశ్రీ। ధరునిసర్వాలంకార। పరుని మంగళాబ్ధి నరహరిని భజింతురా॥ ౨ ॥ వీక్షణాళులలోక। రక్షణాజేసివి భు। వక్షమందునెలకొన్న। శ్రీలక్ష్మినిగొలతురా॥ 3 ॥ పణిలోచనివీణా। పాణిపద్మజునిపువ్వు। బోణిసద్వాక్యమిచ్చు వాణి దలంతుస్ ॥ ౪ ॥ అంబరాంబరతబి। దంబరుడైదాస। కదంబము నేలుశివు పాంబు సేవింతురా॥ ౫ ॥ అగరాజదుహితశివుమే। న్నగముజేసిననెలత। జగములేలెడు గౌరీజననినుతింతురా॥ ౬ ॥ వ్యాసవాల్మీకకాళీ। దాసవర్యమద్వైత వానుదేవాదికవుల వర్ణనజేతురా॥ ౭ ॥ పొంకముతోభవానీ। శంకర గురుపాద। పంకజములకునే। ప్రణుతులొనతురా॥ * * *

వ ॥ అనిఋష్టదేవతా ప్రార్థనంబును। సుకవిజనాళి నందనంబును। అష్టద్గురువందనంబునుంజేసి। సనాతనాధునాతన నాఖలసన్మవిజనానుగ్రహంబునుంగోరి। శ్రీమద్దేశిక కృపాకటాక్ష వీక్షణాప్రవర్షా। తనుథారపానాస్వాదనమత్త మధుపాయమానచిత్తుండనయి। గురుభక్తిసంయుక్త సరసహృదయుండనగు పురాతనపుణ్యశ్లోక రాజర్షిబ్రహ్మర్షి సమాకర్ణనోత్కంఠితంబును। యాంధ్రగీర్వాణదేశ్యాది వివిధశబ్దదళ విరాజమానంబును। రసోచిత చమత్కృయా ప్ర

సవంబును। విశాలయశోవిరాజమానఫలంబును। సర్వజనవందితానం
దమూలంబునునయియున్న। శ్రీకృష్ణసత్యభామా పరిణయకల్పకం
బనుకథను। యక్షగానంబుగా భక్తినాటకగ్రంథంబు జేయంబూనితినే
తత్కథా ప్రారంభంబెట్టిదనిన॥ * * * *

ద్వి॥ పుణ్యమైధరణి బెంపూనిననుకవి। గణ్యమానయి మిశార
ణ్యంబునందు। సత్రియాగంబను సవనంబు సలుప। ధాత్రీధవుల్లడ దా
రులుగూడి। యగణితగుణసిధి యాసూతుజూచి। విగళితపాపౌఘు లయి
వేగననిరి। సూతగుణశ్రోత నూరిసంభూత। పూతమతివిధాత బోలునీ
చేత। నీతరిశ్రీకృష్ణునియతములన్ని। బ్రీతిపెంపొందను ప్రేమమీరంగ।
గావునహరికథా కలితమయినట్టి। నీవాక్యసరణి వర్ణింపుము నేడు। అ
నవినియామునియాహ్లాదమొప్ప। గనుగొనిద్వాదశ స్కంధముల్ దెలి
య। బలుకుచోరుక్మిణీ పరిణయంబంత।నులుకులేకయ జెప్పి యార్జి
తుండనెను। భామాలలామ జాంబవతింగ్రహించె। భామినీమణి సత్య
భామనుమణిని। స్వామినిందయొనర్చి సద్విధిదెచ్చి। నీమంబుతోదుని
వ్వశ్రీహరికి। సత్రాజితుండంతశౌరియాసతిని। మిత్రతబెండ్లియయి మిం
చెనువినుడి॥ * * * *

క॥ ఘన సత్రాజితుడుగ్రత। ననవిల్తునిగన్న మేటికపరాధంబుల్।
వినవాడిమణియుగూతు। న్వినయంబునదెచ్చియిచ్చెవినుడిమునీంద్రుల్॥

క॥ అనవిని సూతునిగనిముని। జనములనిరి యతనికెట్లుసమకూడె
నొనా। ఘనమణిహరిదూషణకున్। పనియేమో విస్తృతముగ బల్కు
ముసూతా॥ * * * *

క॥ అనియడిగిన సంయములకు। మునినాథ కులోత్తముండు ము
దమొందుచుజ। య్యనజెప్పదొడగె హరిపా। వనసత్రాజిత్తు పుత్రివ
యి వాహికముగ౯॥ * * * *

గీ॥ దేవముని దెల్పినట్టి యాదివ్యకథను। యవనినాటక రీతినేనాం
ధ్రమునను। యక్షగానంబు జేసెదానందమునను। మంగళాద్రినివేశుని
మహిమనిలను॥ * * * *

వ॥ అది యెట్టిదనిన।

వ॥ నీవెవరో యీ సభకువచ్చిన వివర మెట్టిదో సవిస్తరముగాదె లుపరాయోరీ॥

* దండహస్తని దరువు. *
ఝుంఝోటి రాగం.
రూపక తాళం.

కనకవేత్రధరుడను నేకదలివచ్చితి గనుడీ। నాకథనువినుడీ॥ జనమనోహరుడుగ్రసేన। జననాథుడు బనుపమిగుల॥ క ॥ ౧ ॥ కరములదాల్క త్తులధగ। లిరుగడలను మెరయగా। సరిగపాతాళ పాగతలను। చాక లించిపొలు యల్మీర॥ కన ॥ ౨॥ రంగుమీరినట్టిజో। డంగీలనుదొడిగి। ఉ ప్పొంగుచు మహారాజునుబహు। భంగులదలచుచు వచ్చిన॥ కన ॥ ౩ ॥ గరిమ మంగళాద్రిపాన। కాలరాయ పదయుగములు। మరువక దల పోయుచునా। మహనీయుని కొల్వునకును॥ కన ॥ ౪ ॥ * * *

దం ॥ ద్వి ॥ వినరయానాదు సద్వృత్తాంతమెల్ల। ఘనుడుగ్రసేనా ఖ్య జననాథు నెమ్మి। నయముగొల్చుచు నలరినవాడ। గొనకొని మహా రాజు కొలువుజేయుటకు। పనిబూనుచునునన్ను బంచిననేను। జననా యకునియాజ్ఞ జనుదెంచినాడ॥ * * *

దం॥ గీ ॥ ఉగ్రసేననృపాధీశు డుర్విజనుల। సమత పాలన జేయ గా సభకువెడలు। క్రమముగను లేవ మీరలాగ్రహము లుడిగి। సభ యులయి సభనిలువుడీ సభికులార॥

దం॥ వ ॥ పేశాదె। వాయుముదు। ఘుపో। పుకార్నకో॥ సద్దుస ద్దు॥ యిప్య। యిందయడత్తుక్క। ఉగ్రసేన మహారాజా వఘుల్। వరువార్। యందందయడత్తిర్। యిరక్క పట్టార్। వినయభయభక్తి విశ్వాసత్తు నాలేజాగ్రతనాయు।యిరక్క వేణుం॥ మెల్లమెల్లన నీసభ కు నుగ్రసేనమహారాజ వల్లభుండు వచ్చుగాన। యీ సభికుల భయు లరై విభవంబులతోతమతను తావులక్రమముగానుండుడీ సభికులారా॥

సం॥ వ॥ ఇట్లు దండహస్తుని వలన దెలుపంబడి సభికులందరు భయవినయ సంభ్రమంబులు ముప్పిరిగొన తమ తావులనుండు నవసరంబున,

ద॥ వ॥ ఎవరయా మీరిచ్చటకు వచ్చినముచ్చట హెచ్చుగా దెలుపరయా,

ఉగ్రసేనమహారాజువేషం- కథ.

ఉ॥ ద్వి॥ వివరింతునాకులవిస్తారమెల్ల। నవని యాదవవంశమునెడి పాథోధి॥ చంద్రుడై సకలదిక్పాలనగుణ। సాంద్రుడై లోకముల్ సన్నుతిసేయ॥ యాహుకరాజేంద్రుడన గానుమించి। బాహుబలస్ఫూర్తి భవ్యసుకీర్తి॥ నఖిలభూస్థలికి రాజై జెలంగగను। సుఖయగునాతని సుతుడనైభువిని॥ నిగ్రహానుగ్రహానియలితోడుతను। నుగ్రసేనుండన నుర్వి పాలింతు॥ సర్వకుడైనాకు నమిత తేజమున। గర్భమందునబుట్టి కంసుండుథరను॥ దుర్భావుడై తానుదోర్బలలీల। నిర్భయంబునదుష్ట నివహముకూడి॥ గర్వించి దేవకీగర్భడింభకుల। నుర్వినార్పురజంపె నుగ్రుడైమించి॥ వసుదేవదేవకీవరదంపతులను। కసరుచువారలకారాగృహమున॥ నుంచిననారాయణుండుతద్గర్భ। మంచితమారీతినలరియాతాను॥ జనియించికృష్ణాఖ్యచేవానిజంపి। పనిబడినాకు తావట్టంబుగట్టి ॥ నన్నుద్ధరించెను నాకృష్ణమూర్తి। వెన్నునికృపచేత వెలయుచునుంటి॥

ఉ॥ గీ॥ బాణభౌమాదిమంత్రులుబహువిధముల। నిరుగెలంకులనిల్చి రానింపెసంగ। హితులుసామంతులునుపురోహితులునన్ను। గొల్వగావచ్చితని కొల్వుకూటమునకు॥

రాజు తెర వెడ లె డి దర్వు.

సావేరిరాగం - ఆదితాళం.

ఉగ్రసేనుడనేనయ్యా। మహరాజనంగభువి। నుద్ధరించెటివాడనూ॥ ఆగ్రహమునగాక చిన్నికృష్ణున। నుగ్రహంబువలన రాజ్యమేలిబు। థాగ్రగణ్యులనుదయచెమనిచిన।మగ్రయుద్ధములనిగ్రహించితిని ॥ ఉ ॥ పటు

మధురాపురి మొదలి రాజధానిగా।బహుదేశములనేలీ। ఘటికుడనుచును హింగణుతింపగనున।కుటిలపుకుతినై కోరికచేతను। డిటమున మీరుచు దేవకీసుతుని। పటిమజేరుకొనిబ్రిబలుచునుండెడి ॥ ఉ ॥ దండనీతినిదగిలి। సామదానభేదములండబాయక మిగిలీ।పుండరీకనయనుని జింతింపుచు। దండిబాహుబల ధైర్యములకునా। ఖండలుండనుచు గణుతింపగ భూ। మండలంబు దండిమీర నేలెడి ॥ ఉ ॥ రాజాధిరాజులచేత। నరిగొనుట నువిభవ।భాజినైయునుసమిత। వాజికరిరథవిరాజితుండనై। తేజమొ ప్పమంగళాద్రిపద। రాజీవములను గొలచుచునుండియు। నాజిశత్రుజై తుడనగమించిన ॥ ఉ ॥ ౩ ॥

సం॥ వ ॥ ఇట్లువచ్చి ఉగ్రసేనమహారాజు కొల్వు సింహాసనంబు పైకూర్చున్నయడ సప్తాంగంబులవారు తమతమతావులనున్న యవసరంబున దండహస్తుండిట్లనియె॥

దం॥ వ ॥ శ్రీమదఖండలోక భారవహనాతిరేకసామ్రాజ్యలక్ష్మీని వాస దక్షిణ బాహార్గళా। పరాకు।

దం॥ వ॥ శాంతశమదమాతివినయ। జయాభయ దయాది సాద్గుణ్య విస్తారసేముషీ విధేయా, పరాకు,

దం॥ వ ॥ అనవరతదీక్షానువమదీత్తశాంతి గురుపాదచింతనాన వద్యస్వయంప్రకాశపిలీనాత్మ స్వరూపావలోకనా, పరాకు.

దం॥ వ ॥ ౪ ॥ భాగ్యవతీమనోనాయకా, బహుపరాకు,

దం॥వ ॥ ౫ ॥ ఉగ్రసేనమహారాజ రాజకంఠీరవా, బహుపరాకు,

సంధి॥ వ ॥ ఇట్లు దండహస్తుండు కైవారంబుసేయునవసరంబున సభయెల్లం కలయుంగనుంగొని మంత్రులంగాంచి యుగ్రసేనుండిట్లనియె॥

ఉ॥ క॥ ఛప్పన్నదేశములలో। నెప్పెడి రాజాళిమమ్ము నూహింపు చుదా। రప్పనములు దెచ్చిచ్చిరె। యెప్పుడు మాయాజ్ఞ మతులనెంతురె మంత్రీ॥

ఉ॥ వ॥ ఓమంత్రి శేఖరులారా,

మం॥ వ॥ ఏమిరాజశేఖరా,

ఉ॥ వ॥ ఛప్పన్నదేశాధీశ్వరులూ- మాయాజ్ఞాక్రమంబు దప్పక చరియించియప్పనంబులిచ్చుచున్నారా, లేదా జెప్పుడీ మంత్రులారా,

మం॥కందార్థం॥ దేవరశాసనమేమది! భావించుచు నరులు బెట్టి భయనయములచే! కావరములుడిగితమయా!జ్ఞావశులై రాజులవని చరియింతురయ్యా ॥ భూవరచంద్రా చరియింతురయ్యా ॥ చరియింతురయ్యా సజ్జనలోకసంస్తుత్యా! గురుపుణ్యధన్య సద్గుణరూపసౌజన్య ॥ చ ॥

మం॥ వ ॥ ధరణీధరా తమయాజ్ఞ సిరసావహించి । నరవరులరు లిచ్చి నిరతము భయనయాదులచే! చరియించుచున్నారు దేవరా॥

రాజు, మంత్రుల సంవాదం దర్వు.

శుద్ధకాంభోజి రాగం - అటతాళం.

ఉ॥ చ ॥ సప్తాంగములు సుఖసహితులైయుండిరే మంత్రులారా।

మం॥ చ॥ వినుము, సుప్తాప్తులై తమ కొలువుగాచి సంతృప్తులైయుండిరి నరవరా॥౧॥

ఉ ॥ చ ॥ పాడి పంటలచేత బరగునేధరయెల్ల మంత్రులారా।

మం॥ చ ॥ వినుము, పాడిపంటలు తమపాలనమహిమచే బ్రబలియుండును ధర నరవర॥౨॥

ఉ ॥ చ ॥ భూమీసురలు అగ్నిష్టోమముల్ జేతురేమంత్రులారా।

మం॥ చ॥ వినుము స్వామిపరిపాలన శక్తిచే విప్రులు సవనముల్ జేతురు నరవరా॥౩॥

ఉ॥ చ॥ పతియాజ్ఞదప్పక పడతులునడతురే మంత్రులారా।

మం॥ వ॥ వినుము, అతిశయభక్తిచే పతిపూజ జేసియు, వతులు నడచెదరు నరవరా ॥౪॥

ఉ॥ చ॥ నరులు మంగళగిరినాథుని గొలతురే మంత్రులారా।

మం॥ చ॥ పరమపావనుడైన పానకాలరాయు పదములుగొలతు

రు నరవరా॥

సంధి॥ వ॥ అని రాజమంత్రులు సంవాదించి నిండుకొల్వులోనుండు నవసరంబున। దౌవారికుండరుదెంచి సవినయంబుగా కైవారంబుచేసి। యెవ్వరో రాజవర్యులరుదెంచిరని విన్నవించిన॥

ఉ॥ వ॥ అరే దౌవారికా। ఆవచ్చిన రాజోత్తములెవ్వరో వారిపూర్వోత్తరంబు చక్కగ నారసిరారా॥

దౌ॥ చిత్తము మహాప్రభో॥

దౌ॥ ఓహో రాజోత్తమా మీరెవ్వరో చక్కగ జెప్పరయ్యా స్వామీ॥

స॥ వ॥ తెలిపెదను వినరా యోరీ॥

సత్రాజిత్తు వేషం కథ.

సత్రాజిత్తు ద్విపద.

వివరింతు వినుము నావృత్తాంతమెల్ల। సవరణచేనిక్ష్వజనపతియనగ॥ కలిమినిబలిమిని గంభీరమునను। యలఘుడైచలముచేనలరుచునున్న॥ యతనిగర్భంబునందానందమహిమ। నుతకీర్తిచేప్రసేనుండును నేను॥ను ద్భవించితిమి నేనెుగిసూర్యుగోరి। సద్భక్తిచేతపశ్చరణంబుజేయ॥ వచ్చితినాపేరువరుసతోవినుము। సచ్చరిత్రుడనునేసత్రాజితుండ॥

దౌ॥ ఉగ్రసేనమహారాజా బహుపరాకు॥

ఉ॥ ఏమిరా దౌవారిక॥

దౌ॥ సత్రాజిత్ప్రసేనులను రాజవర్యులరుదెంచిరి స్వామీ॥

ఉ॥ మహామంచిది రానిమ్ము॥

సత్రాజిత్తు తెరవెడలెడి దర్వు.

కమాచీరాగం - ఆదితాళం.

సత్రాజిత్తనెడివాడ। యిత్తరిజూడ।సభకువచ్చియున్నాడ॥ పాత్రి

ముగనుశత|పత్రమిత్రుడై|చిత్రగతితపస్సిద్ధికివచ్చిన॥సత్రా॥ వితతవిఖ్యా
తి|యుతుడు బాహుబల|విస్తృతవరయప్రశస్త్రధరుడను మడ| చతురత
నాబలశౌర్యంబులుజన | వితతిబొగడగను వెలసిచరించెడి ॥ స ॥ ౧ ॥
అనుజునీతోడగూడీ | కులసతి గొల్వ|జనుదెంచి నాడజూడుడీ | అనవరత
ముమంగళాదిప్రతిపద|వనజములనుమదిభ| జనముజేసెడి॥సత్రాజి॥౨॥

సంధి॥ వ ॥ ఇట్లు ప్రసేనకళత్రాదులతో సత్రాజితుండు సభకరు
దెంచి | ఉగ్రసేనమహారాజుంగాంచి నమస్కరించి తదనుమతిని బడసి
యుచితస్థానంబునగూర్చుండి రాజుంగాంచియిట్లనియె॥

కందార్థము॥ రాజేంద్రపద్మినీవిభు|పూజించిభజించిమిందిరప్రణ్యావన
ములో| తేజముగతపముసేయుచు| వేజననచుజ్ఞ ఋష్యా వీరాధివీరా॥ మే
రుధీరా|కారుణ్యాపారా॥ఘోరవైరివిదారదారుణఖడ్గ|ధారాంభోజాం
డభూభుజోద్దండ ॥ వీరాధివీరా ॥

వ ॥ అనిన సంతసించి ధరణీకాంతుండనుమతిసేయంగైకొని|ప్ర
సేనుంజూచి యిట్లనియె॥

* సత్రాజిత్తు కందార్థము *

అనుజుడతపమునకైనే| జనియెదనటనాముకోర్కెసఫలతనొందుం|
బనివినిబహుళవరమ్ములు| గొనివచ్చెదనీకుతగినకోర్కెలిచ్చెదనూ ॥ మ
నసుదీరనరుకు మెచ్చెదనూ॥ కర్కశమగుతపముగావించుమునులసం|ప
ర్కవశముచేతపవపడియిటనీకు ॥కోర్కెలిచ్చెదనూ॥ మనసుదీరనరుకు
మెచ్చెదనూ ॥

స ॥ వ ॥ కర్కశమైనఅడవిని|మునులసంపర్కవశముచే|నరుకు
నికొరకు తపమాచరించి| యాతనివలన|కోరినకోర్కెలువడసివచ్చెదన
సంభ్రమతనుండుమా|ప్రసేన॥

* ప్రసేనసత్రాజిత్తుల దర్వు *

సంవాదం|బిళ్లహరిరాగం - అటతాళం.

స॥ చ॥ అనుజపోయివత్తున|ఆదినారా|యణుకృపగని తెత్తూన॥ఘనత
పోబలసిద్ధలనుపమానభక్తి| గనినముమీశ్వర|గణముబోలి యిల|జనవినుత

తపమూని ఘనుఁడగు। దినమణిని మెప్పించి క్రిష్ణుర। గని మణిని మోదధనముచే కొని। సునిసితంబగు కీర్తి వెలయఁగ ॥ ననుజపో యి ॥ ౧ ॥

ప్ర॥ చ॥ భ్రాతతపముకూడునా। రాజసగుణో । పేతచేతనులకు॥ వాతపర్ణాంబువులవర్జితహారాది। ఫూతవృత్తిశరీరపుష్టినిబొలగించి॥ భీత మయునితపోనియామక। జాతమానియమోగ్రసంపద। నేతవైభోగ్యముల దొరకి ధ। రాతలంబునస్పృక్క జిక్కియు ॥ భ్రాతతపముకూడునా ॥ ౧ ॥

స॥ చ॥ తలనల్లజడలల్లవా। ప్రసేననా। తలపులెల్లదీర్పవా॥ మొలకు నారచీరెలెలమిదెప్పింపవ। కలితవ్యాఘ్రాజినములవఱగప్పవ ॥ కలితబాహ్యేంద్రియములం। దలకడచిమిక్కిలి మెరయుచుంభువి। గలశమాధికసత్వసంపద। బలయుతంబగుతపము జేయఁగ ॥ ననుజపో యివత్తున ॥ ౨ ॥

పు ॥ చ॥ పుడమిజడలుగూర్తువ। సిగముడలెల్ల। పులిచర్మముల జేర్తువ॥ కడువడి యండవానలబడనేర్తువ। జడియక రేబగలిడుములకోర్తువ॥ గడియగడియకుదలచిసీవా। గడలవిడచిటుబడుగు కైవడి। వెడలి తపసులదారిలోబడి। కడగివనముల గాలిదిరుగుచు॥ భ్రాతతపముగూడున ॥ ౨ ॥

స॥ చ॥ పుట్టినందుకుతపము। సేయక కామ్య। మెట్టునొందగలము॥ ముట్టుమీరకగృహమున బ్లైకాపాడుచు । దిట్టవై మెలగునేని ట్టైవచ్చెదజుమ్మి॥ పట్టుగా నేతపము జేతును। భాస్కరుని మెప్పించి కామ్యము। గుట్టుగా చేపట్టి మిమ్మును। ముట్టవచ్చెద నెట్టకేలకు ॥ ననుజపోయివత్తున ॥ ౩ ॥

ప్రా॥ చ॥ శీతోదకస్నానము। వేకువలేచి జేతువెఁయతముగా॥ ధ్రాతకంటకక్షితిబవ్వళింపగలవే। ధాతలిఖితగు ప్తనర్మమేమనవచ్చు॥ ఫ్రాతనానువిదారికృష్ణుని। సోల్కనరహరిమంగళాద్రిని। ఖ్యాతిగా వెలుగొందువాడె। గతియుముక్తికి గదలుటకునై॥ భ్రాతతపముగూడున॥ ౩ ॥

స॥ చ॥ ఎన్నిజెప్పినవినవు। ప్రేసెననీ। చిన్నబుద్ధులుమానవు ॥ కన్నతండ్రితపము। గైకోని సేయుగ। నున్నవాడనువలదన్న నేమాననా। పన్నరతుకుడైనలక్ష్మి। పానకాలరాయుకృపగల। దన్నవేడని కామితార్థము। గన్నవాడనుగాదలంపుము ॥ అనుజపోయివత్తున ॥ ౪ ॥

సంధి॥ వ॥ అనియెట్టకేలకు ప్రసేనునొడంబరచి సత్రాజిత్తుండు తపోవనంబునకరుగునవసరంబున మగనికడ్డంబువచ్చి॥

సంధి॥ కందార్థం॥ లలితాంగి యతనిపల్కులు ములుకులక్రియదోచమదినిముదమందకదా। చలనముభయమును బెనగొన।కలవలపడి బలికెమగనిగనుగొనిదింతక॥పలికెకాంతఘునమైనవంతక॥ జననాథనిను బాసిమనసెట్లుతాళునిం।దునసల్వనీతోడ। జనుదెంతుకరుణింపు॥ వినుమనెదింతక॥

లలితాంగిదర్వు - ముఖారిరాగం - ఆదితాళం.

పాయజాలనురాప్రాణనాథ।నిన్ను॥బాయ॥మాయధారిదైవముగుమంగళాదీశుడే సాక్షి ॥ పాయజాల ॥ కాయజుని శరములివిగో క్రమ్ముకొనివచ్చెవిధుడు।గాయువెన్నెలచిచ్చులోనకదోయదగున యీవేళ॥ బాయ ॥ ౧ ॥ నాపైకరుణమానిన। నలినాప్తుగొల్వబోవ। కాపురమేల నీతో।గలసివచ్చుదానసిక ॥ బాయ॥ ౨ ॥ నీవింటలేకయర। నిముసమైన నోర్వనునా।భావమెంచనీతోడుత।పైనముసేయకుండిన ॥ బా ॥ ౩ ॥ కామసుందరనా।నోముఫలమాయిటుల। తామసించవలదునీకు।దండముబెట్టెదసామి ॥ పాయజా ॥ ౪॥

ల ॥ గీ ॥ సతినిమెడజేసిపోయెడిపతులుగలరె। మతినిబరికింపు నామాటమమతలిడక।కుతుకమునదమయంతియు బతియుగలసి। జతగనేగరె రఘుపతీసతియుమున్ను॥

ల॥ వ॥ యెడబాయలేక మగనితో దమయంతియు, రామునితో సీతయు,గలసి యడవికేగలేదా। అటుల నేనిన్నెబజాల। నీవెంబడివచ్చెద ననుగూడి చనుమాప్రాణనాయకా॥

స॥ గీ॥ కలికినీకింత వగపేలగాసినెంది। కమలమిత్రునిమెప్పించి కనికరమున కామితముగొని తెత్తునీకాంతలిత్తు।నలినలోచననీవిటు బలుకదగునె॥

* సావేరిరాగం - త్రిపుటతాళం *

సత్రాజిత్తు దర్వు.

వలదనివగఁపేలనే। తపమునకేఁగ। చెలులురాదగవగునే ॥ వ ॥ నళినాక్షినినువేఁగ। గలయవచ్చెదచిత్త। మలయవేనటనొందకు।వలదనివలుకక ॥ వలదని ॥ అంతిపురిని యుండక।రాకాంతలెల్ల। నడవికిరానెంతురే॥ఇంతకంతర్వర్తి।నీవెట్లురానేర్తు। భ్రాంతినొందక శ్రీహరి।ధ్యాంతరముననుండు॥ వలదని ॥ ౧ ॥ సతతముపతిభక్తికి। మిఁతిదప్పిలోక।సతులిటు వెతఁగందురే॥ యితరమెల్లనుభాయా। పతిఁగొల్చికామ్యము। హితమతిఁగొనిపునరా। గతుడనయ్యెదుపనికి ॥ వలదని ॥ ౨ ॥ మదిలోధైర్యముబాయక। కుదవతనీదు। మదికుదురుగొనజేయవే॥ పదపడిమంగళాద్రి।సదనునిపదముల। వదలకఁగొలచుచు। ముదముననుండక ॥ వ ॥ ౩॥

స॥ వ॥ గురుతరతపంబున ఖరకరునిమెప్పించి।తగినవరములవడసి। త్వరలోవచ్చెదగాన నెమ్మదినిటనుండుమా కొమ్మా॥

ల॥ వ॥ మంచిదిపోయిరమ్మా వల్లభా॥

సంధి॥ద్వి॥ అనిపల్కి తల జడలల్లించి బూది।దినికినవల్కలాజినములఁగట్టి॥ చలితబాంహ్యేంద్రియచలనంబడంచి।ఫలితమానసతపఃప్రాభవంబలర॥ అటవికినేఁగిపుణ్యాశ్రమంబునను। పటుతరశాఖాగ్రబంధురంబయిన ॥ వటముక్రిందనునూర్ధ్వబాహుఁడైకాలి।బొటవ్రేలిపైనిల్చి బొగడెభాస్కరుని॥

స॥ శ్లో॥ భాస్కరాయనమస్తుభ్యం।ప్రజాపాలనభానవె। నమోతమోపహర్త్రాయ।జగతాంపతయేనమః॥

స॥ వ॥ అజ్ఞానాంధతమోపహర సుజ్ఞానస్వరూపా సూర్యనారాయణా నమోనమః॥

పున్నాగరాగం - అటతాళం

* సత్రాజిత్తు ప్రార్థనదరువు. *

ప॥ నెరనమ్మితినమ్మితి। ప్రభాకర ॥ నెరన ॥ ఉ ॥ ప ॥ ఖరకరముల ధర।గానజేయుచులోక।భరమునడచినశ్రీ। కరమూర్తివగుని న్నె ॥ నె ॥

స॥ వ॥ కిరణజాలోజ్జ్వలప్రకాశితభువనావరణా। సర్వజగన్నుతచ

రణా।సారతరకృపా విరాజితపరిపూర్ణాంతఃకరణా।సన్మునినతచరణా॥ మాంపాహి - మాంపాహి - మాంపాహి॥

చ॥ పరమపావనుడవుగా। నీకన్నబ్రి।పంచమందునగావగా॥ మరి నేనెరుగనీ।వరమరసేయక। కరుణనేలెవవని। పరిపూర్ణవాంఛచే ॥ నె రనమ్మితి నమ్మితి ప్రభాకర ॥ ౧ ॥

స॥ వ ॥ కరుణారపావననిఖిలసుధీజనవరేణ్యా॥మాంత్రాహి-మాం త్రాహి - మాంత్రాహి ॥ ౧ ॥

చ॥ కర్మములకుసాక్షివై । జీవకోటి । కాలవిదితచక్షువై । నిర్మ లాంశములను । నిఖిలజగంబులు। నర్మిలిగాచిన। నారాయణునిన్నె ॥ నె రనమ్మితి ॥ ౨ ॥

సం ॥ వ॥ యుష్మచ్ఛరణారవిందా।శ్రితభక్తవరదా । శాశ్వతఫల దా।మార్తాండాభయదా।జయప్రదా। శుభప్రదా । మాముద్ధర । మా ముద్ధర।ఉద్ధరమా ముద్ధరోద్ధరా ॥ ౨ ॥

చ॥ ప్రత్యహముమనుగావగా।విప్రులకునీ। వత్యున్నతిదొరివుగా । భృ త్యులరైనీకు।నిత్యనమస్కృతుల్ ।ప్రత్యూషమునజేసి। పాత్రులైరనవి ని ॥ నెరనమ్మితి ॥ ౩ ॥

స॥ వ॥ బ్రహ్మవిష్ణుమహేశ్వరాత్మకా । ఛాయామనోనాయకా। బ్రహ్మకులాగ్రగణ్యాభీష్టవరప్రదా । పుండరీకమిత్రా । భవత్ప్రాపక వియోగావరుద్ధమానసోహం । మాంత్రాయస్వ । మాంత్రాయస్వ । మాంత్రాయస్వ।మాంత్రాయస్వ ॥ ౩ ॥

చ॥ కుష్టురోగముగప్పగ । నిలనుమేహ। గుల్మాధిక్యత నెంచగ॥ శిష్టతచేనుప। విష్టులై(మొక్కగ।భ్రష్టతమాన్పికా। పాడితివనవిని ॥ నె రనమ్మితి ॥ ౪ ॥

స ॥ వ ॥ ప్రభాకరా । అభివర్ణనాతీతప్రభాకరా । విభాక రా । సుగుణాకరా । స్వభావజనితభక్తిసంయుతభాసితహృదయోహం। భవద్దర్శనం మే, దేహి, మే, దేహి, మే, దేహి, మే, దేహి ॥ ౪ ॥

చ॥ సరసీజాలయగలసీ।శ్రీమంగళ।గిరివరమునవెలసీ॥వరదుడై(ప్రే మ్హొను।బరిపాలించిననర। హరి యేసాక్షిసు।స్థిరమతిగని।నిన్నే॥ నెర ॥౫॥

స॥ వ॥ దేవజగద్రక్షా। క్షీణదాక్షిణ్యపరిపూర్ణనారాయణదక్షిణా క్షాఖిలలోకాద్యక్ష ముముక్షుజనాభిరక్షా। భవద్దర్శనాపేక్షో హం॥ మాంరక్ష। మాంరక్ష। మాంరక్ష। మాంరక్షా ॥ ౫ ॥

కందార్థం॥ వెన్నునివలగన్నానని। న్నెన్నందరమవునె భవదుదీర్ణోద యనా। పన్నప్రసన్న సతతము। మన్నించియొసంగుమన్న॥మహనీయ పుణ్యా।సద్గుణధన్యాసౌందర్యపూర్ణా॥ నిన్నుకన్నులారా। నిరతముగ నుగొందు।పున్నాగనుత సర్వభువనావనశరణ్యా॥మహనీయపూర్ణా॥

సంధి॥వ॥ ఇట్లుసత్రాజిత్తుండూర్ధ్వబాహుండును। నిరాహారుండు ను। నిష్ప్రపంచకుండును। నిరాలంబుండును। ఏకాగ్రమనస్కుండును నై అఘోరతపం బాచరింపుచున్నయెడ। నావేడిమిసత్యలోకపర్యం తంబునిండి।జాజ్వల్యమానంబుగా తపింపంజేసిన। సహింపకనిలింపుల వలన తపనుండెరింగి।యాసత్రాజిత్తునకు సాక్షాత్కరించెనట్లనిన॥

ద॥ మీతేజంబెల్ల నఖండంబై బ్రహ్మాండంబులునిండి తండోప తండంబైయున్నయది మీరెవరో దెలుపరయా॥

## * సూర్యనారాయణవేషం కథ. *

ద్విపద॥ మహితంబువినుము మన్మహనీయసరణి। గ్రహనాథుడన గ విఖ్యాతిమీరంగ॥ జగములేలుమసహస్రాంశుడనగ। పగలురేయను కాలపరిమితంబెరుగ॥ నుదయాద్రిమీదనేనుదయించిమరియు।పదపడి హస్తాద్రిపజ్జకేగెదను॥ పరమేష్టియాజ్ఞ।ప్రభాకరుండనగ।నరయపంచ్రెండ డభిఖ్యలనెప్పవాడ॥ సరళిసత్రాజిత్తు సల్పెడితపము। పరిపూర్తిజేయ గాబరతెంచినాడ॥

## * సూర్యునిదరువు - తోడిరాగం - ఆదితాళం.*

గ్రహనాథుడనునేనురా ధరనునవ ॥ గ్రహనాథు ॥ అహితబలంబు ల। నసువులుబాపెడి।మహితభృత్యులనె।మ్మదివెల్గొందెడి ॥ గ్రహ ॥ పది రెండురూపముల।ప్రళయముననొక్క।పగిదివెలుగునాడరా। వదలకన నుమది గదసినవారల। ముదముచేతనెమ్మదిగనిబ్రోతును॥ గ్రహ ॥౧॥

వీరస్వర్గము నొందగా। నాలోనిదెగా। దారివీరులు జెందగా। మారులేనిమహిమకురువకశూరుల। గారవించిపరిపాలన జేయుదు॥ గ్రహనాథుడను నేనురా। ధరసునవ॥గ్ర॥ ౨॥ ధరను పాలనజేయుచు। శ్రీమంగళ।గిరివరమునసుండుచు।బరగినట్టినర। హరికరుణనునా। శరణు జొచ్చుజన।సంఘము నేలెడి ॥ గ్రహనాథుడను ॥ ౩ ॥

సూ॥ వ॥ బ్రహ్మాండకటాహంబుల నిండియున్న ఘృణిమండలంబులచేనుండునట్టి మార్తాండుడనురా నేను॥

సంధి॥ వ॥ అనిపలికి తపంబుజేయుచున్న సత్రాజిత్తునకభిముఖుండై నిలచి సూర్యనారాయణుండిట్లనియె॥

*సూర్యునిదర్వు - నాదనామక్రియ రాగం అటతాళం.*

పద్మబంధుడవచ్చినాడరా। నేత్రపద్మముల్ దెరచినంజూడరా॥ పద్మజాండములోన పరికింపనీవలె। పద్మమొల్లకతపము సల్పువారలగాన॥ ప ॥ జననాథతపముజాలించుమిా। మమ్మా। గనివాంఛితమ్ము లెరిగించుమిా। వనవాసివైభోగావాంఛితార్థమువాసి। ఘనతపోనిష్ఠచేగాసి నొందగనేల ॥ ప ॥ ౧ ॥ వరములగోరదలంచితో। ముక్తి। వాంఛచేతపముగావించితో।పరమిచ్చకళ్యాణగిరివాసుడైనశ్రీ।హరియుతాననెగాద। యదినీవువినలేద ॥ ప ॥ ౨ ॥

సంధి॥ కం॥ అనవిని కన్నులుదెరచియు। వినమితయష్టాంగదేహవివరంబులతో।మునవృత్తిని సత్రాజి। న్మనుజేంద్రుడుబల్కె ముందు మార్తాండునితోన్॥

*సత్రాజిత్తుదర్వు*

స॥ క॥ స్వామిా దేవరతేజం। బీమాంసవుకనులజూడ నేజాలుదునే। నామేను కంపమొందెని। దేమో దెలియంగరాదు * మెరుగబలుకుమా ॥ యిటనున్న నీవెవరో దెలుపుమా॥వరమానిదాఘూఘుపజ్జులకిరవైన।కిరణసహస్రముల్ధరములయ్యేనునేడు ॥యె ॥ పరమపురుషుండైనమంగళ।గిరివరుండవో।కమలజుండవో।పురహరుండవో గాక యగ్నివో।సురపతివో, రవివో విష్ణుండవో ॥ మెరుగబలుకుమా ॥

స॥ వ॥ కనులు మిరుమిట్లు గొలిపె। మనము తెలివిదప్పె। తనువెల్ల కంపమొందె। ఘనమయిన తేజంబుతోనా। కనులకు గనవచ్చితీ రీతెవరో వివరింపరియా.

* సూర్యుని కందార్థం. *

భావము నిష్కామ్యముగా। గావించి తదేకనిష్ఠగా ఘోరతపం। బీ విధిజేసితివన్నా। నీవాంఛిత ఫలములిత్తు॥ నిటునన్నుగన్నా। నీతపము ధీహితమయ్యెనన్నా। పటుమతీననుగోరి భజియించుధీరుల। కుటిలము లణచి కోర్కెలు దీర్చు దేవుడ॥ నిటు॥

సూ॥ వ॥ అన్నా నీవుజేయుతపంబువలన। మిన్నంది। నాకున్న రూప నీకన్నులకు జూపితి। ముజ్జగంబులలో నెన్నంబడిన। వెన్నునివలగన్నునుగాదా। నీకున్నభయంబు మానుమిదె యభయంబిచ్చితి। నీ తపంబునకుమెచ్చితి యింక జడుపేలరా బుడుతా సత్రాజితా॥

సం॥ వ॥ అని భయంబుదీర్చి। యభయహస్తంబున సత్రాజిత్తుని దేహంబాద్యంతంబును। స్పృశించిన నవ్వనజబాంధవున నుగ్రహంబువలన తెలివిగలిగి। వివశతమాని యవయవంబులు స్వాధీనంబులయి యున్నంజూచి। తనయెదుట కనుల జూడందగిన రూపంముతో గానవచ్చుచున్న సూర్యనారాయణదేవునింగాంచి। ద్వాదశదీర్ఘదండ నమస్కారంబులు సమర్పించి। లేచి వలగొనిక్షమాపణంబు జెప్పి। నిటలతటఘటితాంజలీ పుటుండయి సత్రాజిత్తుండిట్లని స్తుతించె॥

* ముఖారి రాగం ఆటతాళం. *

సత్రాజిత్తు దరువు.

పల్లవి॥ మిత్రనన్నుగావుమయ్యా। ప। విఖ్యాతుడనయితిగదయ్యా॥ అ॥ ప॥ పుత్రమిత్రకళత్రాది సంవృతగాత్రుడనయితినీకరుణజూడుపద్మ॥ మిత్ర॥ కోరి వేడితి మీయంఘ్రులను। కడ। చేరితి గడచి యాపదను। కూరి మిచేబోది గారవించెదవని। ధీరమతిని బ్రస్తుతింపుచుంటిని పద్మ॥

మిత్రి॥ ౧ ॥ కుటిలతలెల్లమానంగ। కరుణ। గోరితిమనమలరంగ। చ
టులతరాఘౌఘు। జలధిలోపలమునిగి। తటముగానక దుస్తర మతీన
యియుంటి॥ మిత్రి ॥ ౨ ॥ చిత్తమెంతైన చంచలముదు। ర్వృత్తుల
కెల్ల నాకరము। మత్తగజమువలె మమతదిరిగిగర్వా।యత్తమైనదాని।
యలజడిదీరిచి॥ మిత్రి ॥ ౩ ॥ నన్నుకృపను బ్రోవకున్నా। వేర। నా
థులిచ్చటలేరన్నా। విన్నవించితిజూడ। మున్నమంగళగిరి। పన్నగశయ
నునిపాదమానపద్మ॥ మిత్ర ॥ ౪ ॥

సం॥ వ ॥ అని వేదవక్ష్యమాణ ప్రకారంబుగా నుతించి। వలగొ
ని పునఃపునః ప్రణామంబులాచరించి। లేవకున్నంగని। స్వసదృశ వి
రాజమానంబై। చింతామణికంటె। నధికంబై పరగు శమంతకమణి
నివ్వనిశ్చయించి। తచ్ఛరీర నిగ్రహనివారణగాన భయహస్తంబతని
మస్తకంబునసిడి యిట్లనియె॥

యమునాకళ్యాణి రాగం ఆది తాళం.

* సూర్యుని దర్వు. *

ప॥ శ్యమంతమణినీకిచ్చెదనికనా। చరణములను విడరా। లేరా॥
శ్యమం ॥ ఉ ॥ అమోఘముగ కామితమ్ములిలనీ। వందగలవురారా
ధీరా॥ శ్యమంతమ ॥ పరాకిడక దీనిదేవతార్చనభవనమందునిడరా।
నిరాకరించక నిరతముపూజల। నిర్వహించుకొనరా। ఔరా॥ శ్యమం ॥
౧ ॥ కరాకరినిదీని సాటిరావుగ। దరాయిలను మణులు। బరాబరిని
యెనిమిదిబారువులసు। వర్ణమిచ్చుగదరా।ధీరా॥ శ్యమం ॥ ౨ ॥ యే
రాజేలెడిభూమిని యీమణియర్పింపగ బడునో। యారాష్ట్రంబున
మారీదుర్భి।క్షాదులణగుగదరా।పోరా॥ శ్యమం ॥ ౩ ॥ ఘృణిగొనియా
డగ। ఫణిపతికైనను। గణనగాదుగదరా। రణమొదువక భూరమణుల
కునుసుఖ।కరముజేయుగదరా।గనరా॥ శ్యమం ॥ ౪ ॥ వరదుడైన మం
గళగిరినరహరి। కరుణగాచికొనరా। గురుతుగానుమణి యిచ్చెదనేనై।
కొనరవేగలేరా। రారా॥ శ్యమంతమణి నీకిచ్చెద॥ ౫ ॥

సూ॥ ద్వి॥ మానుగా వినుము యీ మణివివరంబు। బూని నేనిన్నిమి
ది బారువుల సువర్ణంబు॥ దినదినమిచ్చు నీప్సితములు గలుగు। మణి
యున్నరాజ్య భూమండలంబెల్ల॥ ఘనయీతిబాధలు గనరందు నరు
లు। ధనధాన్యములు గలిగి దనరుచునుండు॥ అవని దుర్భిక్ష రోగాదుల
ణంగు। భవుకంబు గలుగు నాపట్టణంబనను॥ యిదిమహాద్భుత కాంతి నీ
గుచునుండు। సదనంబునకు వేగ జనుమిదె గొనుము॥

సూ॥ వ॥ దినదినంబెనిమిది బారువుల సువర్ణంబీమణి యిచ్చుగా
న యీ మణిగొని గృహంబునకు జనుమా మీను జేంద్రా॥

* మారువా రాగం ఆదితాళం *

సత్రాజిత్తు దరువు.

ప॥ గృహమునకేగెద సెలవొసగుమిదె। గ్రహనాయక యిపుడు॥
ఉ॥ మహిలోనీకు సమానులు లేరని। విహితమతి జగతి। వెలయజాటె
దను॥ గృహమున॥ వలగొని దండ నమస్కారములివె। పలుమరు జేసితి
నీ। కలనైననువిడగాజాలనునీ। వలనను నాకిహ ఫలములు గలిగెను॥
గృహ ॥౧॥ అహితవర్గ జైత్రుడనై మిక్కిలి। నవని వెలింగెదను। మ
హితవిక్రముడు। మంగళగిరివరు। మహిమ లెన్ని నిను। మరువకుండెదను॥
గృహమునకేగెద ॥ ౨ ॥

స॥ వ॥ నామనోరథపూర్తి జేసి శ్యమంతకమణినిచ్చితివి బు
చ్చుకుంటిని స్వామి నీపాదపద్మముల దలచుచూ। నిలుజేరెద శలవొసం
గుమా జలజాప్తా॥

సం॥ ద్వి॥ అనువేళ నతనికి నాజ్ఞయొసంగి। ఘనభక్తినాతండు గ
నుగొనుచుండ॥ దనరుచు సూర్యుడంతర్ధానుడయ్యె। వనజబాంధవు
నాజ్ఞ వడసి ద్వారకకు॥ రానూహ జేసి సత్రాజిత్తుడాత్మ। లోనసం
తసమొంది లోకములెల్ల వెలుగ॥ జేయునమ్మణికంఠసీమ నుదాల్చి। చాయ
కననుపమ ప్రభలచేరాగ॥ నంతనక్కడ ద్వారకాపురమందు। నంతిపు
రంబున నాతని కాంత॥ జాడలన్నియు జూచి చానలిట్లనిరి। చేడె రో నీయి

ఖ చిహ్నముల్ చూడ॥ వింతవింతలుమాకు వేడ్కగన్పట్టె । నంతకంత
కు గర్భమధికంబుగాగ॥

బాలింతవేష కథ.

చెలి॥ తే ॥ గీ ॥ చెలియనీపతి తపముకు జేరకమును। నెలకునతె
యోగిలింతలు బలసియొదవె। నలసటలజిక్కె మేనునాహారమింపు। లే
కయుండుట జేసి నాళీకవదనా॥

చెలి॥ వ ॥ చెలియా నీచెలువుడు తపమునకుజనకమున్నే। నెలదప్పిన
ది నానాటికి। అలసతలుబలసెనేమియుర్కజెప్పవేమె।యోభామినీమణీ॥

సం॥వ॥ అనిన లలితాంగి సిగ్గున తలవంచుకొనిన చెలులిట్లనిరి॥

చెలి॥ ద్వి ॥ నిట్టూర్పులధికమయి నిద్రకన్నులకు। పట్టుగాదోచెను
బడలెనెమ్మేను॥ చన్మొనల్ నలుపయ్యె చానరోనారు। ముమ్మనుసాగె
ను మోముతెల్పెక్కె॥ నడుముదొడ్డయ్యెను నాతిరోసొమ్ము। లుడుగ
నిబరువయ్యె నువిదపాలిండ్లు ॥ బలసెనీపిరుదులు బహుళంబు జూ
పె। నలసటమెండయ్యె నాతిరోవినవె॥ మన్నుపయిరుచిబుట్టె మది
తెలిపిగిట్టె । సన్నగాదినమొక చాయగాదోచె॥ ననుదినంబును గర్భ
మధికమయిమిగిలె। వనజాక్షుతలపు లెవ్వరసనున్నవియొ॥ యెరుగ
రాదయ్యె మేమేమిసేయుదుము। భరమెక్కువయ్యెనో పంకజనేత్రి॥

సం॥ వ॥ అనిన లలితాంగి తన గర్భవేదన తెలిపెడు విధంబెట్లనిన॥

* లలితాంగి తెరదరువు. *

మోహనారాగం ఆదితాళం.

ప ॥ మగువరో నొప్పులు ప్రబలమగుచున్నవీ యీవేళ। నగవుగా
దు నడుమునొచ్చె నన్నుబట్టరే ॥ మ ॥ ఊ ॥ తగవులిచ్చి। మంత్రసాని
ని। చాయబిల్వరె। చెలులార। జగతీసురలనారణాలు చదువబంపరే॥
మగువ ॥ సుందరాంగులారాగుడి। నందినిత్రిప్పరేమీర । ధేనుడు
ముఖులెల్లమంత్రతీర్థమివ్వరే॥ మగు ॥ ౧ ॥ ఒడలెంతోబరువయ్యె
మొలకు। వలువసడలి నిలువదయ్యె। వడివడిగానిలువేల్పులకు। ముడు
పులు గట్టరే। మగు ॥ ౨ ॥ పడతిమంగళాద్రినివెలసిన। పానకాల
రాయుక్పపసి। మెడనెట్లున్నదో తెలియదు। నుతువజాలనే॥ మగు ॥౩॥

ల॥ వ॥ చెలులారా॥

చలి॥ వ॥ యేమమ్మా లలితాంగీ॥

ల॥ వ॥ పుండరీకాక్షుని నిందుకృవ నీపింఛము వెలుపలబడితేచా లునే। యింక మగని తెరువుకుబోనె వేదండయాన॥

చె॥ ఇంతవయిరాగ్యములు బలికినవారే యీరవ్వంత ఆటంకము తీరగానే యేమోపనియున్నట్లు మంతతనంబునకు బిలచి మగనితో కంతుకేళి కూడేవారు చాలునోర్చుకోవమ్మా ఫూతెమ్మా యివుడే మంత్రిసానిని తోడితెచ్చెదము.

చెలి॥ కం॥ ఓ ముద్దైవాడగంగా। తామసముంచకువె నీకుతడబడనిధన। స్తోమములిచ్చెద మింకను। సేమంబునవచ్చి లలిత క్షేమము గనుమా॥

చెలి॥ వ॥ నీకు వచ్చే వచ్చుబళ్లన్నీచెచ్చెర నిచ్చెదముగాని। నీ పుణ్యము య్యేను వేవేగ రావేగంగా-

మం॥ వ॥ తేపతేపకూ మీరాపదకొలదీ బలకడమేగాని యీాయ నిలుకడ జాలదు। రానుగాని। పోపోరమ్మా.

సం॥ వ॥ అని సఖిజనంబులును। మంత్రిసానియు పలుమరు వాదింపుచున్న సమయంబున। నిలుపజాలని భరమున లలితాంగి మంత్రసానితో నిట్లనియె-

* పున్నాగవరాళి రాగం ఆటతాళం *

లలితాంగి దరువు.

కడుపులోసులిపోచ్చి గడియగడియకెంతో। ఘనమగుచుండెనే గంగా॥ వడిగవడిగనెంతో బడలిలోపిండము। కుడియెడమ దిరిగెనే గంగా॥ నిలువలేనెనొప్పు లలముకొనియెనా। చిలుక తాళిచ్చెనేగంగా। చలముసేయకు భన్నసరము రతనాలు। గలగొలుసు లిత్తునేగంగా॥ కడుపు ॥౧॥

లలి॥ వ॥ ఓ ముద్దైవాడగంగా రావేరావే.

మం॥ వ॥ అన్యమెట్టేవా పుణ్యమెట్టేవా। నాడెట్టేవా। నేడెట్ట డానకు। గంగూదా! గంగూదా। గంగూదా అని నోరు నొప్పిలేక పిలుస్తావు। రానుపోపోవమ్మా॥

ల లి॥ వ॥ అబ్బా! అబ్బబ్బా అబ్బబ్బా॥

ల॥ చ॥ ౨॥ అబ్బబ్బ యిక తాళ నాయాసపడజాల।గొబ్బునరాగదే గంగూ॥ నిబ్బరములేక నిలువజాలకమది। కబ్బురంబుదోచెగంగూ॥క॥

లలి॥ వ॥ ఓ మచ్చైవాడగంగూ! సన్నంబుగాని నొప్పలిప్పడధిక మాచున్నవే రావే॥

మం॥ వ॥ నీకానుపు చులకని కానుపుకాదమ్మా। వెనుక నరువ యి వరాలకడియంబగా ధానపడ్డది। నేనురాను పోపోవమ్మా॥

ల॥ చ॥ ౩॥ మిన్నుపయినెరగి నట్లున్నదేమి సేతు।కన్నతల్లి విరావే గంగూ॥ చెన్నుమీరగమనము। చెదరెనిప్పుడునా। కన్నులానవిన వేగంగూ॥ కడు॥

ల॥ వ॥ ఆకాశమువిరిగి మీదపడ్డట్లున్నదే రావేగంగూ॥

మం॥ వ॥ మొక్కజొన్నకండెల కొడికట్టవద్దమ్మా వడిలోబెట్టుకో వద్దమ్మా అని నేచెప్పలేదా నోరుచేయక తాళవమ్మా కొమ్మా॥

ల॥ చ॥ ౪॥ యెంతవేడినరావు। సుంతయినతాళనో।కాంతామచ్చై వాడగంగూ! చెంతరావే నీకు చింతామణులగూర్చు। కంతుకమిచ్చెద గంగూ॥ కడు॥

లలి॥ వ॥ ఓ మచ్చైవాడగంగూ। యెంతబిల్చినారావేమే సుంతయి నా కనికరంబు లేదటే నీకు బంగరుకంతుకంబు లిచ్చెనేరాగదే॥

మం॥ వ॥ అతఃపురంబులో నీవేకాంతంబున నుండగా। నే కొం తపనిబట్టి నీచెంతకువచ్చి బిలచితే రాకపోతివే। నేరానుపోపోవమ్మా॥

ల॥ చ॥ ౫॥ కడువడి నామనము కలవెలపడెనుకడ।కాలువడకెగ దేగంగూ॥ నుడవలేను నాతొడలు సడలెనట్లు। కడచేరగలనెయో గంగూ॥ కడు॥

లలి॥ వ॥ నామనము కలవెలపడెను నీమది కరుగదేమే రావు గంగూ॥

మం॥ వ॥ మేలు మేలయిన వస్త్రువలు నాచేతబెట్టుమంటె అప్పు డు నేకనుపడనుగానీ యిప్పుడేల రాను పోపోవమ్మా॥

ల॥ చ॥ ౬॥ సుడిబడునె మొనా। యొడలుఝల్లుమనె।కడియలోనెం తా మెగంగా॥ పడతీయేమహానె యీపుడమి నిప్పుడునా। కడబాయ నొల్ల నెగంగా॥ కడు ॥

ల॥ వ॥ యొడలు జల్లుమని మెగాన। మెట్టులయిన గట్టిగననుబట్టి యుండవేగంగా॥

మం॥ వ॥ యిట్టులన్నవారే పదనకొండవరాత్రి మగనిబట్టి వదల క యుండగలవారు గాని రాను పోపోవమ్మా॥

ల॥ చ॥ ౭॥ గరి మెమంగళాద్రి నరహరికరుణయే। సరణినున్నదోరా వెగంగా॥ గురుతుమీర వానికోమల పదములీ।తరిని మొక్కుచు రా వేగంగా॥ కడు ॥

ల॥ వ॥ మంగళాద్రీశ్వరుని కృపవచ్చినట్లు నీదయ వచ్చె నేమం దునేగంగా॥

మం॥ వ॥ కడియలో ప్రిసవించెదవు కలవెలపడక నూర్చినిలువ మ్మాకొమ్మా॥

సంధి॥ వ॥ అని పలుకునెడ నామంత్రిసాని సర్వగ్రహంబుల వా కట్లగట్టుచు నుచ్చాటనంబు జెప్పుచు। స్తంభించుచు। వచ్చివచ్చి లలి తాంగికి విభూతీ మంత్రోదకంబు లిచ్చిన॥

ల॥ వ॥ అబ్బో మెంతని వోర్చుకుందునే దంతిగమన॥

చె॥ వ॥ యింతలోనే కంతుజనకుని కరుణవచ్చు నూర్చుకోవ మ్మా కాంతామణి॥

ల॥ వ॥ అమ్మమ్మ మ్మమ్మమ్మా వోయిస్వామినిలువనేరనురా॥

చె॥ వ॥ యికడికి లలితాంగి కష్టమీడేరెనమ్మా అక్కలారా॥

చె॥ వ॥ యేమిపిల్ల గలిగెనమ్మా భామామణులారా॥

* ఆనందభయిరవి రాగం- ఆదితాళం *

* చెలుల దరువు *

ప॥ నాతిజననమాయె మాటనమ్మరమ్మా॥ ఉ॥ ఖ్యాతిగచిహ్నము

లెన్ననలవిగాదమ్మా॥ బొడ్డుగోయ్యారమ్మా చిన్నిబిడ్డబట్టిమీరలు। స డ్డసేయక నొడలారే జలకమార్చరే ॥నా॥ ౧ ॥ గోమయపిండము లు సిలలుకోరువులు। మూడేసిచిన్ని। కామినిజొట్టపయి శౌచీకములకి వ్వరే॥నా॥ ౨ ॥ బోటులారనుదుట దృష్టిబొట్టుబెట్టరే। సాంబ్రాణిధూ పముగబాలకు ముమ్మాటువేయరే॥ నాతి ॥ ౩ ॥ బంగారుచేటలోప ల బాలనుంచరే। కనులసింగారముగ కాటుకదీర్చి చేరిగాంచరే॥ నా ॥ ౪ ॥ మణులతొట్లెలో బాలికామణిని నుంచరే చెలులార।పని గొనిమీరందరు లాలిపాటపాడరే॥ నాతి ॥౫ ॥

## * శ్రీరాగం అటతాళం. *

## లాలిపాట.

ప॥ లాలిపల్లవపాణి లాలిశుకవాణీ। లాలియళికులవేణి లాలిపూ బోణీ॥లాలి॥ఉ॥ లాలితంబయిన యీలలితాంగిగర్భ।గోళమందునబుట్టి కొన్నమాపట్టీ॥ లాలి॥ గొనబయిన వజ్రాల గొలుసుపదిలించి। సనజా తిముత్యాల జాలరమరించీ। కనకాంగినందులో ఘనతచేనుంచీ। యొన రగాతొట్లెచే యూచిలాలించీ॥ లాలి ॥ ౧ ॥ భద్రముగతొట్లెలోపలప వ్వళించీ। నిద్రబోవమ్మ మానితముగానెంచీ। ఛిద్రంబులుడిగించి సిరులల రమించీ। యద్రిబోలినధయిర్య మమరగ ధరించీ॥ లాలి ॥ ౨ ॥ గురుని ద్రగయికొమ్మ కుందనపుబొమ్మా। మురువంపు రెమ్మమామకముద్దుగుమ్మా। కరుణారసముమేన ఘనతచేజిమ్మా। సరసంపునీదృష్టి సారింపవమ్మా॥ లాలి ॥ ౩ ॥ వరమపావనివమ్మ బహుశుభములిమ్మా। సిరులతో నవత రించితివెమాయమ్మా। అరయనీకెనయయిన యతివలేదమ్మా। ధరమంగ ళాద్రి నరహరికి తగుదమ్మా॥ లాలి ॥ ౪ ॥

సంధి । వ। అని చెలులత్యానంద జలనిధిని మగ్నమానసులై యా లలితాంగి బుడుతనుగన్నవార్త ప్రసేనునికి తెలిపిన నతండువారల ను సన్మానించి విప్రులచే జన్మపత్రిక వ్రాయించి సంతోషంబుతోడ నున్నంత।సత్రాజిత్తుండుదరలి। ద్వారకాపురోద్యానంబునకువచ్చిన॥ దం॥ వ॥ నీలమేఘ సమానాకారులై బాలిమీర నీసభకరుదెంచి

తిరీలీల మీరెవరో వచ్చినపని దెలుపరయా బాలస్వరూపులారా,

*** శ్రీకృష్ణవేష కథ ***

కృ॥ ద్వి॥ వినరయోరీనాడు వృత్తాంతమెల్ల। వనజాయతాక్షి దేవకిగర్భమందు॥ వసుదేవసుతుడనయి వాంఛచేబుట్టి। యసమానగతి మందయందునబెరిగి॥ అక్రూరసందేశినయి మధురయందు। విక్రమంబునజొచ్చి వీరుడామేన॥ మామకంసునిబట్టి మర్దించిమించి। యామహీరాజ్యంబు నందుననుగ్రసేనునినిల్పితత్థిరభారమూని। మానుగాదుష్టుల మర్దింపుచుంటి॥ గానమాతామహుగాన్చకొల్వునకు। నేనునుభ్రాతతో నిటువచ్చినాడ॥

*** నాటకురంజీ రాగం అటతాళం ***

**శ్రీకృష్ణుని దరువు.**

ప॥ వినుడీనేవివరించెద। దెలియగానువినుడీ। నేవినుపించెద ॥వి॥

ప॥ మునుకంసాదుల భా। రమునకోర్వకనుధర। వనజగర్భుడు దేవగణములు పాల్కడలి॥ కనఘులయిచని పురుషసూక్తిని।నునువినుతులొనరింపగాధర। మనుపదేవకి గర్భమందున। జననమొందిన వారమింతయు॥వినుడీ॥ వసుదేవదేవకులూ। దూరీకృత। వయిరి వర్గయుతులు॥ అసమానులయ్యుని। రాహారులైగొల్వ। పసమీరవారికి ప్రత్యక్షమైనచో॥ వసుధవైష్ణవ మాయచేబెం। పెసగు మోక్షముగోర నేరక। మసలుచునునాయీడు కొడుకుల।నొసగుమన నేనుదయమొందితి॥వినుడీ॥౧॥ నందయశోదలను। సృష్టికాల। మందువిరించిమును। ముందుగ భూమిపై బుట్టుమనగనుగో। విందు సేవ గల్గునందుబుట్టెదమని। వందనములిడివిధిని వేడగవారిజాసనుడట్లనేయన। నందుడనజన్మించె మేమామందయందునబెరిగితిమి యిట॥వినుడీ॥౨॥ మాతామహుండనగ। నుగ్రసేన। మహారాజుబిలుపింపగ॥ తాతగారికొలువు తగజూచియతనికి। ప్రీతిజేయగను విఖ్యాతివచ్చితినిటు॥ భూతలమ్మున [illegible] నుండగునరహరియునే। నైతిగాన ననుభజించిన। పాతక[illegible]

సిపోవును॥వినుడీ॥ 3 ॥

కృ॥ వ॥ దేవకీ వసుదేవుగర్భంబువలన జన్మించి। యీవసుధమా పూజార్థమైబుట్టియున్న నందయశోదల యింటబెరిగి। భూవినుత ముగా నకూరుడు బిలువయిటవచ్చి। దుర్మార్గుండగు కంసునిదుంచి। మాతామహుండైన యుగ్రసేనుని రాజుగానేమించి। జననీజనకుల మనంబుల సంతసంబుంచి। యిప్పుడు కొల్వునున్న తాతగారిని జూడవచ్చిన బలరామ కృష్ణులమురా మేము.

సంధి॥ వ॥ ఇట్లు బలరామకృష్ణులువచ్చి తాతగారికి నమస్కరించి తదనుమతివడసి యొక సింహాసనంబున గూర్చున్న యెడ దండహస్తుండిట్లనియె॥

దం॥ వ॥ శ్రీమదనేకబ్రంహ్మాండభాండావనతత్పరాబహుపరాక్॥

దం॥ వ॥ దేవకీ వసుదేవతనయా బహుపరాక్।

దం॥ వ॥ శ్రీ రుక్మిణీ మనోనాయకా బహుపరాక్॥

దం॥ వ॥ సజలజలద సంకాశదేదీప్యమాన మంగళ విగ్రహా బహు పరాక్॥

సం॥ వ॥ ఇట్లు సింహాసనోపవిష్టులైన మనుమలంగాంచి ఉగ్రసేనమహారాజేమనుచున్నాడు॥

ఉ॥కందార్థం॥ క్షేమంబుగనున్నారా। శ్రీమా దేవకియుపతియుసిరితనయుండున్ । మీమీయువతులతోడను। రామశ్రీకృష్ణులార।రక్షకులారా॥దుష్టజన।శిక్షకులారా॥తీక్షణంబునీకంసు మోక్షణ మొనరించి।దీక్షచేతలిఖండిం వీక్షించిబోచిన ॥ రక్షకులా ॥

రామకృష్ణుల వచనం॥ అనిన రామకృష్ణులు తాత కేమనుచున్నారు.

ఉ॥ నీదుకృపావిశేషమున నేముకుమారులుమాతృవర్గము। న్మోదము మీరవర్ధిలిసమున్నతినిత్యముతావకీయస।త్పాదయుగంబులందలచిబ్రస్తుతి సేయుదుమయ్య భూరిపుణ్యోదయ యుగ్రసేన మహితోజ్వల రాజ్యరమామనోహరా॥

వ॥ అని తమకుశలంబెరింగించి మాతామహసమేతులై క్రమ్మర ద్వారకానగరంబునకు మహావైభవంబునం జనుదెంచి పేరోలగంబు

న సింహాసనారూఢులై సముదిత సంభాషణంబులం బ్రిమోదింపుచు
న్న సమయంబున॥

సంధి॥ వ॥ ద్వారకాపురప్రజలు తత్పురోద్యానవనంబునకు సహ
స్రప్రభాకరసంకాశంబయిన శమంతకమణిని కంఠంబునధరించి వచ్చి
న సత్రాజిత్తుంగాంచి। భీతచేతస్కులై। శ్రీకృష్ణ సాన్నిధ్యంబునకరిగి
తత్పాదారవిందంబులకభివందనంబులాచరించి వినుతింపందొణంగిరి॥

* పురప్రజల దరువు. *

ముఖారి రాగం - అటతాళం.

ప॥ పురజనులముగావు కృష్ణా।పరా।పరకర్తవీవె శ్రీకృష్ణా॥ ఉ ॥ ము
రహరభవహర ముకుందమాధవ। కరుణాకరమిమ్ము గానవచ్చితిమిం
దు ॥ పు ॥ కరిరాజునుబ్రోచితివీ। కనక। కస్యపసుతునిగాచితివీ। పరి
పూర్ణ కృపచేత పాంచాలికొసగితి వరమరసేయక యక్షయాంబర.
ములు॥ పుర ॥ ౧ ॥ ఇతరమెరుగముశ్రీకృష్ణా।నీ। హితమె గోరితిమిశ్రీకృ
ష్ణా। సతతముమీపాద సరసీరుహాంబులె। గతిగాదలంచుచుమతిమ్రొ
క్కుచుందుము ॥ పుర ॥ ౨ ॥ మరిమరిమముబ్రోవనేర్చిన।మీసరిదైవ
ములు లేరుయేర్చిన। గురుతరమంగళ గిరిసరహరికృప।గరిమమిమ్ములను
గనుగొనుచుందుము॥ పురజనులము ॥ ౩ ॥

అసావేరిరాగం - అటతాళం.

ప్రజల దరువు.

వాసుదేవ మీకాసజేసెడిపుర।వాసజనులబ్రోవవే ॥ ఉ ॥ ప ॥ వా
సవార్చితనీవే భాసమానుడవని । దోసిలొగ్గినిన్నె దొడరిగొలచుచుం
డ॥ యీసమయముఽకోటి సూర్యుల।తోసమంబగునొక్క ప్రభది। గ్వా
సమై గనుపట్టెదానికె। గాసిపడి మిము గాంచితిమి శ్రీ॥ వాసు ॥ మో
సపడకనెన్నో। వాసరముబుభవ। ద్దాసులమైనారము। యీసరికెన్న
డు యిందుగననివిప।ర్యాసముగల్గెని।దేసరణివచ్చెనో॥ యీసమీపము
జేరుచున్నది। యోసరోరుహనేత్రజగదా। వాసమగుదాని గనజాలక।
మీసముఖముకు జేరినారము ॥ వాసు ॥ ౧ ॥ యదువంశమునమీరు।

సదమలమతితో।నుదయించినారయ్యా। కృష్ణయ్యా ॥ బొదువనే మోపె నుభూతములాగున। చదలనుండివచ్చెస్వామి యెన్న డుగాన ॥ మదెయి టులడాయంగజేరెను । మాధవా మేమేమిజేతుము।సదయుడగుబ్రిష్ణు దే వుండో సారపాప్తుడో। వీతిహోత్రుడో ॥ వాసు ॥ ౨ ॥ మనవి చే కొనిదయ । మమ్మాదరింపుమా। వనజదళాతకృష్ణా॥ దినకరప్రభలచేది వినుండిమిముజూడ । ఘనులెవరోవచ్చిరి గనుగొననేరము॥ జనవినుత శ్రీమంగళాచల। మునదనరునరహరియొహరియొ।ఘనుడు శ్రీప్రమథా ధినాథుడో।కార్తికేయుడో కమలవైరియొ ॥ వా ॥ ౩ ॥

ప్రి॥ వ॥ ఈశ్వరుడో అలవాణీమనోహరుడో। మార్తాండుడో। లేక మమ్మున బెదరింపవచ్చిన పెనుభూతమో యొక పెద్దవెలుగువచ్చె ను జూడుమా పచ్చవిల్తునియయ్యా॥

ప్రి॥ సీసం॥ మాధవశ్రీధర మదనసుందరచంద్ర వదనబింబాధరవా సుదేవ। భూధరోద్ధరశౌరి పుండరీకదళాక్ష వేదనూపుర వేదవేద్యహృ ద్య । ఆదినారాయణయఖిలాండకోటి బ్రంహాండనాయకపాపహరణ శరణు। దేవదేవపరేశదీనజనోద్ధారకారణరూపదిక్పాలవినుత। కదనవ రిపంథిదళన నాగారిగమన। బుధనుతాచ్యుతశ్రీకృష్ణ పురుషమూర్తి । అహాహాయిటుచేరవచ్చెనదేమొమాకు । తెలియజెప్పవెహరి తేటతెల్ల ముగను ॥

సంధి॥ వ॥ అనిపలికిన మూఢజనులం గాంచి సంతసించి సకలవిదుం డైన యప్పుండరీకాక్షుండిట్లనియె॥

కృ॥ శా॥ సత్రాజిత్తనువాడు సూర్యునకు దాసత్వంబు జేయంగ నా।మిత్రుండొప్పిశమంతకాఖ్యమణినిన్నెమ్మినాతనికీనామణిం।సత్రాజిత్తు డు కంఠమందిడి ప్రకాశాయత్త దిగ్భాగుడై । మిత్రాకారత వచ్చుచుం డెనురిమీమీభీతి। సైరింపుడీ॥

కృ॥ వ॥ సత్రాజిత్తుండు సూర్యునికొరకు తపంబు జేసిన మిత్రుడా తనికి శ్యమంతకమణినిచ్చిన నత్యంతప్రకాశాభిరామంబైన మణితో వచ్చు సత్రాజిత్తుండుగాని మరియెవరుగారుసుండీ బ్రజలారా॥

ప్రి॥ వ॥ అట్లాగాస్వామీ సర్వజ్ఞుండవైననీకనేక వందనంబులు దేవా॥

సం॥ గీ॥ స్వామివలన నిట్లు సత్రాజితునిరాక । వినినవిప్రవరులుజ నిప్రసేను । తోడదెల్ప వేడ్కతో గృహంబెల్లన । లంకరింపబనిచి లాల నమునా॥

వ॥ అప్పుహోత్ముల ప్రత్యుత్థాన ప్రణామపూర్వకముగా సంభావించి వారితో ప్రసేనుండిట్లనుచున్నాడు॥

* ప్రసేనవిప్రసంవాద దర్వు *
శంకరాభరణరాగం - ఆదితాళం.

ప్ర॥ ప॥ అన్నలార విన్నారా । కన్నులార గన్నారా ॥ ఉ ॥ ప ॥ మాయన్న వచ్చుచున్నారా । ఆనందానుష్టాన ప్రదముగ ॥ అ ॥

విప్రి॥ ప॥ శౌరిచేవిన్నారము । శామంతామణిహారము॥ఉ ॥ప॥ భూరికాంతిపూరము దూరముదూరము తోరముగాగని ॥ శౌరి ॥

ప్ర॥ జోహారుజోహారయ్యా। వో హొహామంచివారయ్యా। ఆహావే గరారయ్య। అందులకందరు ముందుగ పొందుగ ॥ అన్న ॥ ౧ ॥

విప॥ మానితవిలాసుని। మంగళాద్రివాసుని। పానకాలరాయుని। బంధురసత్కృప నొందముపొందుగ॥ శౌరి ॥౧॥

ప్ర॥ మాగమార్కండేయుని। మనవంశోపాధ్యాయుని। గనివేగ రారమ్మనీ। గ్రక్కునజక్కగ మొక్కుచుబిల్వుడు॥అన్నలారా ॥౨॥

సంధి కందార్థం॥ అంతటసచివులు జనిముని। కెంతయుసంతోషవార్త యెరిగింపగధీ। మంతుడు మునివరుడప్పుడు। సంతోషంబెసగవచ్చె * సరగూననటకు॥రాజునుజూడ। నరుగుముచ్చటకన్। గరిమతో తనశిష్యగణములు సేవింప। హరినామసంకీర్తనముచేయుచును వేగ॥ సరగూననటకు॥

సంధి॥ వ॥ ఇట్లు ప్రసేనుండు పురోహితామాత్యబంధు బృందస్యందన సింధురవాజిభటనటగాయకాది సందోహంబు లిరుగడలం బలసిగొల్వ నగరంబువెలువడి యగ్రజునకభి ముఖంబుగా జనునవస

రంబున భూసురోత్తములు తమలోతమరిట్లని ప్రసంగించుచుండిరి.

౧॥ బా॥ వ॥ ఓ పెద్దయజ్ఞ సోమయాజులుగారు నమస్కారము లుగాని నత్రాజిత్తు యూరిలోనికి వచ్చియున్నాడట ఆమాట మీరే మయినా విన్నారాలేదా॥

౨॥ బ్రా॥ వ॥ ఓ హెూహెూ పౌండరీక యాజులుగారూ నే నయితేవిన్నానుగాని నిజమనుకోనలేదయా॥

౧॥ బ్రా॥ వ॥ వచ్చినాడమమల్లుభోట్లు అందరికి చెప్పచున్నాడయా॥

౨॥ బ్రా॥ వ॥ తిమ్మనయజ్వి అగ్నికార్యముమీదనున్నాడు॥ అహెూబలదీక్షితులు అడవికి సమిత్తులకొరకు పోయియున్నాడు॥ చయనులగారు యిష్టికార్యంమీదనున్నారు తగుపెద్దలు నలుగురు కూడిపోతె బాగావుండుననని నేను యోచిస్తున్నాను॥

౧॥ బ్రా॥ వ॥ అట్టయితేపోక మీరందరినీ బిలుచుకొనిరండి పోదాము యాజులుగారు॥

* మారువారాగం ఆదితాళం *

బ్రాహ్మణుల దరువు.

అట్టయిమ్మపోవకరారయా। అవధానులుమీరల్‌॥ఉ॥విమమహాబాంధవ్యని। మదినివేడిమోకిసిదెచ్చినాడమ। మిక్కిగాచెన్నగానన్మూశ ।మితిలేని కనకమిమ్మనమా॥ తమ్ముడెవరుగ జననున్నాడమా॥బ్రాహ్మణులబిల్చి।తగు వారినేమించినాడమా॥ద్విమ్మరిపురి హెూతాత్మ పెద్దకిమ్మన్న సత్రిపెత్తనము। బొమ్మనిచెప్పినారాయణ। పౌండరీకునికిచ్చినారిమ ॥అట్టు॥౧॥ దీక్షచేసె ద్వాంసులకమ। దుశ్శాల్వలు। పరీక్షచేసిచ్చెదరిమ। అక్షణంబున వి ద్యలచె। నధికులైనవారలకు। లక్షలకొలదిసయికములమ। దీక్షితులతో జెప్పినారమ ॥అట్టు॥౨॥ ముద్దపప్పువండినారమ। తేజోవాచారాలు। కొ ద్దివడ్డనగావిప్పారమా। వద్దికతో నప్పడములు। వడియములూరగాయ లు। పెద్దదొప్పల పాయసము పెరుగుచద్దులొడ్డిప్పారిమ॥ అట్టు॥ ౩॥ బీరకాయలు పేల్చినారమా। కాకరకాయల పిండిమిరియము దండిగా నమ। వారిగపూర్ణబూరెలు గారెలరిశలాము। వడలుకోరికదీర వడ్డన

కుక్కొందుభొశ్లై వచ్చినాడప॥ అపు॥ ర॥ పరుగులోస్తన గావిస్సార
రపా। పొబ్బట్లునెయ్యి। తిరుగతిరుగ వడ్డిస్సారపా। సరగునబోవలెవా
రి సత్రిపాకమునదప। నరహరిస్మరణజేయుచు మరిమరిభోజనము
సేయా॥అపుయపు ॥౫॥

సంధి॥ వ॥ అని యనేకవిధంబులుగా బ్రాహ్మణులు దెలుపుకొని
ప్రసేనునింగూర్చుకొని పంచమహావాద్యంబులు మ్రోయ గణికాజనం
బులాడ। సత్రాజిత్తునకెదురు నడుచునవసరంబున బ్రాహ్మణులు వికట
వేదంబు చెప్పిరి॥

బ్రా॥ వ॥ ఓరేశిష్యా పనసకొంత జెప్పుకోనరా॥

శి॥ వ॥ యేనుయా ఉపాధ్యాయులవారూ చెప్పగయా॥

బ్రా॥ వ॥ యెలుకాంచు ఏవంవేదా। గోసాంగ్రా కిరవె। తంకు
లాంభకుమతి। చెర్లొబొలిపిచ్చికేపట్టా। ధిర్యాదశ్యాహా। ఓన్నగా
జెప్పవేమిరా॥ శి॥ వ॥ చెప్పుతానుగాని యీవనమున గారెలుచాలా
నాకు వేయిస్తారాలేదా॥ బ్రా॥ వ॥ వోంటిండిపోతా, చదువుమీద బు
ద్ధియుంచరా॥ శి॥ వ॥ మీరు తిండికే వస్తున్నారు గాదపయా॥ బ్రా॥ వ॥
నను మళ్లీఅంఛావపరా రంఢా। శి॥ వ॥ నన్నంటె నేననక యీరు
కుంచానపయావిధవాగారు॥ బ్రా॥ వ॥ చూచావిపోయి సుబ్బావధానులు
పీపుకూశెకూతలు। శి॥ వ॥ వినాన్రయా యజ్ఞావధానులుపిరుమొరగె
మొరుగులూ॥

సంధి॥ వ॥ ఇట్లెదురుగ వచ్చి నమస్కరించిన ప్రసేనుని సత్రా
జిత్తుదీవించి కౌగలించి గురువునకు నమస్కరించు క్రమం బెట్టిదనిన॥

కం॥ వందనముతాపసేంద్రా। వందనము నతామరేంద్ర వరగుణ
సాంద్రా వందనము కీర్తిచంద్రా। వందనముమునీంద్ర సుజనవనజవి
నేంద్రా॥ గురువు॥ కం॥ వర్ధిల్లురాజచంద్రా। వర్ధిల్లు మహీత
లేంద్ర వనజాప్తహితా। వర్ధిల్లు సుగుణసాంద్రా। వర్ధిల్లు మహా
రుషీంద్ర వందితచరితా॥

సంధి॥ వ॥ దనంతరంబున సత్రాజిత్తు సకలపరివారంబుల బ
హూకరించి తమ్ముడాది తనవారల క్షేమంబడిగెనెట్టులనిన॥

* నాటరాగం ఆదితాళం *

సత్రాజిత్తు దరువు.

ప॥ క్షేమమా। ద్వారకాపురవాసులూ॥ క్షేమ॥ ఉ॥ క్షేమమా మధురపురవాసులు॥ మామకాగమన కాంక్షితులెల్లను ॥క్షేమమా॥ ప్రేమమీర మనభూమిపాలన జేయు।సోమాన్వయుడగు సుగుణోగ్ర సేనుడు॥ క్షే॥ ౧॥ రామమిావదిన వేమనుచున్నది। భామామణి యిపుడేమి శిశువుగనె । క్షే ॥ ౨॥ రామకృష్ణులు మనక్షేమమాసిభువి। ప్రేమమంగళగరి ధాములవ రైరోవ॥ క్షేమమా॥ ౩ ॥

సంధి ॥ వ॥ అనిన ప్రసేనుడు తమవారల యందరిక్షేమంబుగా వేర్వేర దెలిపి। సత్రాజిత్తునకుబుత్రికాజననంబువిన్నవించె నెట్టులనిన।

* బిళహరిరాగం ఆదితాళం *

ప్రసేనుని దరువు.

నాతిసీకూజననమాయె భూతలనాథా యీాతరినీ॥ యీాతరినీ। ప్రీతిగనీ। జేతోభవునకు మాతయనంగను॥ నాతి॥ సుందరాంగిదిహ్నాముల బ్ధి నందనకును మిన్నందినవీ। అందనవీ। సుందరివీ। నందనందనుని మది జెందబుట్టినట్లుతోచు॥ నాతి ॥ ౧ ॥ లేమముద్దుమోముతీరు। సోముని తోసమమిాను హీనీ। ఈగ హీని। నీమదినీ। ప్రేమకుసద్గుణ ధామతగినయది॥ నా ॥ ౨ ॥ రంగుగనుమంగళాద్రి। సంగరహితు డుప్పొంగుచునూ। పొంగుచునూ। అంగననూ। మంగళకరముగ మరిరక్షించగ॥ నాతి॥ ౩ ॥

సం॥ కం॥ అనవిని సత్రాజిత్తుడు। దనతమ్ముని గౌగలించి తగినవిధముగా।జనములకెల్లనునివ్వగ।దనమనమునధారావోసెధనధాన్యముల్ ।

ఉ॥ అంతటనందరిగ గలసియున్నయు దమ్ముడు మోదమందగా। దాంతశమంతరత్నమును దారతకంఠమునందుదాల్చిశ్రీ। కాంతుడు మంగళాద్రిపతి కామితదాయి యటంచు మ్రొక్కిధీ। మంతులుతోడ రాగ నిజమందిరసీమకు జేరె నెట్లనన్॥

పంతువరాళి రాగం - అటతాళం.

ప॥ పురముఁబ్రవేసించెను।సత్రాజిత్తు।సరసూలరావించెను।ద్వారక।పురముఁబ్రవేసించెనూ॥ఉ॥వరమణీరోచులంబరముదిశలుగప్ప।సరసిజమిత్రునిసరణివెల్గొందగ॥పరులయాలోకనములెల్లను । గురులుదప్పి నిమీలితములై। విరియఁగాపురజనులకెల్లను। వేడుకలనొదవించుచునుతా ॥ పు ॥ కవిగాయకులతోడను।మాగధ।మిత్రి।సువిలాసినులతోడను॥భువివిప్రాశీర్వాదపూతులై పురజనము। లవిరళముగనులా।జాతులుజల్లగ॥వివిధహర్మ్యాగ్రముల తరుణులు వేడుకలగొనియాడిజూడగ। ధవునకెదురుగ హారతుల్కలసతినియోగింప గనుబట్టగ ॥ పురము ॥ ౧ ॥ వరతూర్యములుమ్రోయగా॥భూసుర వేదరవములువడి మెరయగ। పరమభాగవతులుభజనజేయుచురాగా।సురలువిమానములజూచి వెరగందగా॥ కరితురగభటులెల్ల వేడుక। గదలవారాంగనలుముందర। భరతలాస్యములెల్ల జేయగ।పరమసంతోషమునమీరుచు ॥ పుర ॥ ౨ ॥ అనుజన్ముతోడుతను।తనకుసరి।మనుజులగూడుచును। ఘనతమంగళగిరి। కాంతునిదలచుచు। వనితలెల్లని। వ్యాఖులివ్వగొనుచు॥ అనుపమానందంబుచేతను।తనగృహంబును దరియబోవుచు। మునుమనుగపుణ్యయువతీ।జనములనుజొరుమని వెనుకనిజ॥ మందిరముఁబ్రవేసించెను॥ ౩॥

సంధి॥ వ॥ ఇట్లు నిజగృహంబునంబ్రవేసించి సత్రాజిత్తుండు నిజదేవతామందిరంబున బ్రాహ్మణులచేత నామణిని బ్రతిష్ఠించె। నంతనతం డంతఃపురంబునకేతెంచినంగనుంగొని లలితాంగి ॥ గీ ॥ వెదురువచ్చి మొక్కె నిందుబింబానన। పడతిమోముఁగాంచి ప్రముదమెసగ। గారవించిప్రేమ ఘనముగాపరిరంభణాదులను ముదంబొనర్చి వక్కె॥

సత్రాజిత్తుదర్వు. జంఝోటి రాగం - ఆదితాళం.

ప॥ నీరజముఖమును నీతోఁబల్కన।కోరికెలెల్లను దీరెగదా॥ సారసబంధుని సందర్శనమున । ఘోరలోభ పరిహారముగా ॥ ఉపపల్లవి ॥ శ్రీరమణీయ శమంతకగురుమణి । హారముదొరికెగదా ప్రమదా॥ యింతి మనకునికనేమి కొరంత ని।రంతరమునుసిరులలరుగదా।సంతత

రథహయ సామజభటబలములంతకంత దళమయ్యెగదా॥ నీ ॥ ౧ ॥ సుం
దరికాంచనబృందములిటు గృహములందుననమరెడునందముగా। యెం
దరయిననృపులెనయగుదురె యీన। కిందుభాగ్యమునకికతరుణీ ॥నీరజ ॥ ౨॥
పుత్రీరత్నముపుట్టినమహిమము। చిత్రమరయ ప్రియసీవిన వే। నేత్రోత్స
వమగు నెలతవిమోహన। గాత్రకళావళిగన్గొనవే ॥నీరజ॥ ౩ ॥మంగళగి
రివర మందిరనరహరి। యంగనకెనయగు నహహాయిది। రంగుగ త్రి
భువన రమణునితోసుఖ। సంగతికితగిన సఖ వెలదీ ॥ నీరజ ॥ ౪ ॥

సం॥ వ॥ అనంతరంబున నొక్కసుముహూర్తంబున తనకూతునా
మకరణంబొనర్చ నెట్టులనిన॥ సంధి కందార్థం॥ పారోహితుగన్నృపు
డతిగౌరవమున పూజచేసి కౌతుకమెసగన్। కోరికమీరగబాలకు। పే
రిడుమని పల్కుటయును ప్రేమనటించన్। లేమకు సత్యాభామాయ
టంచున్॥ శ్రీమీరశృంగారసీమా సద్గుణధామ। రామాలలామకు। నా
మాకరణమొసగె ప్రేమనటించన్ ॥ వ ॥ ఇట్లుమ్మనీందుద్రెండు నామక
రణంబుజేసి యెల్లవారలంగలయంగనుంగొని యేమనుచున్నాడు ॥ పా
రోహితుని గీతం ॥ సత్య తేజభాగ్యంబులసరళిగాంచి। నిత్యసౌభాగ్య వై
భవోన్నత్యయగుచు। దైత్యమర్దనునకు ముందు తరుణియగును గావు
నను సత్యభామాఖ్యగనియె భువిని॥ తదనంతరంబ పురోహితునకి బ
హుమతులిచ్చిపుచ్చి మరియొక్కదినంబున తమ్మునింగాంచి॥

సత్రాజిత్తుదమ్ము - కళ్యాణిరాగం - అటతాళం.

ప॥ తమ్ముడమనకేమికొదువశ్శశిముఖ।తమిచ్చకనకమింపొదవ॥ఉ॥ప॥నమ్మ
భాగ్యముదిననాధుకృపనుగల్గె॥ త ॥ యంతోతపముజేసితి। వేనుయిూశ్న।
మంతమణిని దెచ్చితి।యింతంతయనరాని యిహసౌఖ్యమిచ్చితి॥ తం॥౧॥
యెట్టివానికైననింతఫల। మేర్పడగల్గునేవింత। పట్టుగమనపూర్వఫలమిప్పు
డబ్బెను॥ త ॥ ౨ ॥ ధరమంగళగిరి।నరహరికృప। డాసివచ్చెనేడు।అరయ
గ మన పెద్దలందని సిరిగల్గె ॥ తమ్ముడ ॥

సంధి॥ కందార్థం॥ మణిగొని జయగతివచ్చిన। పనికృష్ణుని కెరుకప

రచు భావంబుననే గనుగొనివచ్చెదని త్తరి।వినయంబుననేగివత్తు వేడుక లిత్తు॥

సంధి॥ అని తమ్మునితోపలికి। రాజదర్శనంబుకొరకు తగిన కానుకలు గ్రహించి॥

* సంధిదర్వు - శహానా రాగం - జుల్వాతాళం *

ప॥ సత్రాజితురాతిగ్రించరశత్రుకడకు వెడలివచ్చె॥ఉ॥ప॥ మిత్రివరులుగొలువగనుతీపాత్రుడైన కృష్ణుకడకు ॥స॥ధారుణితనతోటిసములులేరనుచు ను ధీరమతిని। సారెసారెకుబ్బితనజన్మసఫల మాయెననుచు। స ॥౧॥ పౌరులయాలోకనములు సారెసారెకనలరింపుచు। గారవమున రాజసభకపారవినయభయములతో॥ స ॥ ౨॥ మానసమున మంగళగిరి। పానకాలరాయుదలచి। మానుగానుబ్రమొక్కులిడుచు మాన్యగతుల మీరుచుండి ॥ సత్రాజి ॥ ౨ ॥

సంధి ॥ వ ॥ ఇట్లు సత్రాజిత్తుండు। గ్రిసేనమహరాజు కొల్వునకు జని యథోచితంబుగా దర్శించి । యమ్మురారి నభినందించి తదనుమతిని గొని కూర్చున్న సమయంబున శ్రీకృష్ణుండు సత్రాజిత్తునింజూచి॥

* శ్రీకృష్ణ కందార్థం. *

సంసారివైననీదుప్రశంసముబహుగాను దనరె చర్చింపగనా। హంసునికడ తపమఘుని। ధ్వంసముగావించిగొంటి।వనవింటి మణిన్।జూపుమీ సభజనమలరన్ । దినదినమును బహుకనకమిచ్చునట। వినుము నీయింటిలో నునుపవగదుదాని। జనవరునికడనునిచి తత్ఫలమనుభవింపుము నీకుమంచిది। గనుక జెప్పితినటుల నీమది।గల్గెనేనియు నట్లజేయుము॥ అనవింటిమణిన్॥

కృ॥ వ॥ అమ్మణినావద్దనుండుటవలన। నీసొమ్మునకు నీకు హానిరాదు। గాన సమ్మతించితివేని యమ్మణినిటనుంచి ప్రిత్యహమ్మా । దానిఫలంబు నీవుగొని చనుమా సత్రాజిత్తా॥

సత్రాజిత్తు దర్వు - పున్నాగవరాళిరాగం - ఆదితాళం.

ప॥ యివ్వనేరనయ్యా।అయ్యాయీమణినినే। నివ్వనేరనయ్యా ॥ రవ్వాడు నేరవిక్రైబహుతప। మువీథిజేసిబహుమాన మందినమణి ॥ని॥౧॥

కోరిశ్యమంతము దేరిచూడగరాదు। భూరికనకమేపొద్దు నిచ్చునీమణి॥ యివ్వ ॥ ౨ ॥ అగణితప్రభలచే జగములవెలిగించు । దిగధిపతులకెల్ల । దేశికనరానిమణి ॥ నివ్వ ॥ ౩ ॥ బలియుడౌ మాపాలి పానకాలాద్రియుని కృప। గలిగిమిక్కిలి భువి ఘనతనొందినమణి॥ నివ్వనే ॥ ౪ ॥

* సత్రాజిత్కృష్ణుల సంవాదం దరువు. *

సౌరాష్ట్రరాగం - ఆదితాళం.

స॥ చ॥ అరుదుగనీమణి । నందినవాడమిా।కడుగ ధన్యునటయ్యా। మేలు। సరసత మిక్కిలీ నెరపమిాతో పాటి। సరసులులేరయ్యా॥

కృ॥ చ॥ ఒకులదగ్గిరనుండ। నోపదిమ్మణిరాజు।కొసగిమనగదయ్యా॥ అతడు।పరిపూర్ణదయనీపై బ్రసరింపజేయును। బహుమాటలేలనయ్యా॥

స॥ చ॥ పంచేంద్రియములను । వంచించిఘనతప । మంచితముగజేయగా।నీకు।సంచితధనమనిసవిత్రుడొసగెతన సహజకాంతులమణినీ॥ అరుదు॥ ౧॥

కృ॥ చ॥ మరిమరిమణిభోజ। మహారాజుకడనుంచి। సిరులనొందగడయ్యా।గరిమెపుత్రపౌత్ర। కళత్రమల వృద్ధిగని పేరుగానవయ్యా॥ ౧ ॥

స॥ చ॥ పలుమారునన్నడుగ । పాటిగాదయ్యానీ।పలికినపలుకుతెల్ల। నిలువవుమదిలోనే। నివ్వజాలలక్ష్మీనిలయుడు సాక్షిగను॥అరుదు॥ ౨॥

కృ॥ చ॥ యెన్నిజెప్పిన వినకున్నావిచ్చుటనునీ । చిన్నిబుద్ధులుమానవు ॥ పన్నగశయనుడౌ పానకాలాద్రియాడెప్పగిది।దలచుచుండెనో ॥ ౨ ॥

స॥ వ ॥ మేలుకారకాలోచించి చెప్పితిరి సరేకాని ఫాలపట్టికయందు జుడు వ్రాయువ్రాలు దప్పదుగావ నామణి నేనిటనుంచజాల॥

సం॥ వ॥ అని పలికి సత్రాజిత్తుండు తనగృహమునకువచ్చి । ప్రసేనునితో నాలోచించెనందు॥

* సత్రాజిత్తు కందార్థం. *

ఈమణిరాజునకిమ్మని రాముని యనుజుండుగోరరామికిగోరెన్।యీ మణి నాధామములో। వేసంబొసరించుదీని నేనీజాలా ॥ అతడుదీనినడుగగ మేలా। మానితుడగుహరికి।మణియివ్వకున్నను। పైనేమైనాను గాని గ్రామ్మిక ॥ నేనీజాలా ॥

స॥ వ॥ ఈమణి తనకిమ్మని హరి యడుగగానేనివ్వనని వాదించి వ
చ్చినాడనోయి తమ్ముడా॥

ప్ర॥ వ॥ మంచిపని జేసినావయా అన్నా॥

సం॥ వ॥ ఇట్లు కొన్నిసంవత్సరంబులు గడిచినపిదప నొక్కనాడు
అన్ననుజూచి ప్రసేనుండేమనుచున్నాడు॥

ప్ర॥ శా॥ అన్నానేమృగయార్థమై వనముకై యాసక్తిచే నేగ
గా। నున్నాడన్ ప్రవిధాస్త్రశస్త్రములు చెన్నొప్పార నిమ్మీమణీ। కు
న్నంచెల్లెద సిద్ధితేజమణిచే కొంకుంబ్రమోదంబునన్। విన్నాణంబ
గు దీనివెల్గునను నే వేటాడెదన్ రాత్రులన్॥

ప్ర॥ వ॥ ఈమణి నాకంఠంబున ధరియించి దీనివెల్గున క్షేమము
గా రేబగండ్లను వేటాడివచ్చెద నివ్వు మన్నా॥

స॥ సీ॥ వేటాడగానేగి వృద్ధులసుతుగూల్చి పొలియడేదశరథభూ
విభుడు। వేటచే శ్రీరామవిభుడు రావణునిచే కులకాంతయగు సీత
గోలుపడడె। వేటలాడుచును సద్విజునిశాపంబున మడియడె అలపాం
డుమహీవిభుండు। వేటకైజనిచంద్రజూటుండుమునుపార్థుచే వేటునోం
దడె శిరముబగుల। వేటనాటవికులతోటి కూటమురయ। పాటిగాదిట
భూపాలపంక్తికెల్ల। మాటలికనేలవేటలుమానియింట। మేటివై యు
న్న నామది మెచ్చునుజ॥

స॥ వ॥ వేటతమిచేత భూపాలకులు వ్రేటుపడి చేటొందుటజూడ
లేదా నామాటనమ్మి వేటకుబోవుటనీకు పాటిగాదుమానుమా ప్రసేనా॥

* ప్రసేనునికందార్థం *

కంధరమున నా మణిదాలిచి। బంధురమగు నడవికేగ పనివినెద కృపా
సింధుడవై బనుపుభవాత్సంధానముచేత వేటనల్పివచ్చెదను। మృగము
లనెల్ల చక్కదెచ్చెదను॥ అల్పముగాని బలములతోడ సంకల్పపూర్ణ
ముగాగ గదలి వేటతమి॥ సల్పివచ్చెదను॥

ప్ర॥ వ॥ అల్పముగాని మృగంబులతో వేటసల్పి నామదిసంకల్పం
బీడేరని త్తరి వచ్చెద నుత్తరువివ్వు మన్నా॥

సత్రాజిత్ప్రసేనుల సంవాదం - దరువు.
పంతువరాళిరాగం - ఆదితాళం.

స॥ వేటవలదు నేవినుమని చెప్పిన। మాటఃనవదేరా। ఓరా ॥ మాటలే
లమన సాటివారికిది పాటిగాదు పోరా ॥ ౧ ॥

ప్ర॥ వలదని చెప్పిన ఫలమేమికి నేవని కేగెడివాడ। వీడ॥ అలయక సొ
లయక నడవిమృగంబుల బిలుకు మాత్రుఁజూడా। తోడా ॥ ౧ ॥

స॥ అమితమైన యాయాసమేలనీ। వరుసవలదు పోరా ॥ ఓరా॥ విమ
లముగు శ్యమంతకమును దాల్చి నీవింటనుండగదరా। ధీరా ॥ ౨ ॥

ప్ర॥ అవనిభూపతులు నక్షవులకై తరుచరుగు టెఱుగవున్నా। వన్నా॥
భువనావనుక్కృప పొందుగ వేటకు బోయివత్తునన్నా ॥ ౨ ॥

స॥ అడవికేగి వేటాడువారి నేనరసియున్నవాడా। జాడా॥ పుడ
మి వేటలకు బోయినవారికి పుణ్యమగునె జూడ ॥ ౩ ॥

ప్ర॥ మరిమరివలదని। మమత పలికెదవు। సరికాదోయన్నా। విన్నా॥
పశులు నగెదరిప్పుని కొరగాదని బల్కకు మోయన్నా॥ ౩ ॥

స॥ జీవహింసలిటుజేయరాదనుచు జెప్పుటవినవటరా। పెద్దలు॥ తా
వువిడువవలద హింసాపరమోధర్మమని నుడువరా॥ ౪ ॥

ప్ర॥ పరమదయాళుడు పానకాలనరహరికృపగనుగొన్నా। నన్నా॥
భరముగాదు ముమ్మాటికి వేటకు నరిగివత్తునన్నా ॥ ౪ ॥

సం॥ వ॥ అని యనేకవిధంబుల వలదను సత్రాజిత్తు నొడంబరచి॥

* సంధిదరువు - నాటకురంజిరాగం - అటతాళం. *

ప॥ వెడలెగా ధీవి వేటప్రసేనుడు॥ ఉ॥ సడలని వెలిజక్కి। సమమాగు రమునె
క్కి॥ జడుపులేకయ సారెసారెకు। వడివడిగ పరవళ్లుదొక్కుచు॥ వెడ॥
దాటెగా। నదీ। నదదుర్గములకొన్ని। మాటెగా। వన। మత్తసామజముల॥
సూటిగా నీటెలసుడియుచును। పాటితప్పక వ్యాఘ్రచమరీభల్లుకాదుల
బట్టిద్రుంచుచు॥ వెడ ॥ ౧ ॥ ఉరుల చేకొనియురుతరముగనొగ్గి। గరిమ
తో జిగురు। కండెలుగొనితగ్గి। సరిలేనిమురిపెము। సందడింపా ॥ ధర
మృగంబుల ద్రుంచద్రుంచగ। బరగులెట్టుచు। గురిని కొట్టుచు ॥ వెడ ॥ ౨ ॥

విహంగముల్ఘోరతెరపి గానసబల్ల హనముల్ జొ ద్భఘనమృగములద్భంచి। సహజకాంతులనుక్యనుంతము వెలుగగా॥ బహువిధంబుల నరమృగేం ద్రుని। భావమెసగక కావరంబుగ॥ వేడ ॥ ౩ ॥

సం॥ వ॥ ఇట్లు ప్రసేనుండతి కుతూహలంబున వేటలాడుచున్న సమయంబున॥

సం॥ గీ॥ మించివనమధ్యమున సంచరించుచుండ। సింహమొక్కటి జనుదెంచి చెలగి యశ్వ।సహితముగనాప్రసేనుని సంహరించి। మించి మణిగొనిపోవగా మించిగాంచి॥

సం॥గీ॥ జాంబవంతుండు సింహముజ్జిం ద్భంచి।మానికముగొని స నుకుమారితొల్లె। పయివిలాసపు కందుకంబనగగట్టి।జనియెగుహాలో పలికితాను సంతసమునా॥

సంధి॥ వ॥ అంత నద్వారకాపురంబున సత్రాజిత్తు ప్రసేనుండు రామికి నిగుల వగలనొందుచు నిట్లనియె॥

స॥ అనుజుండరిగె నేటి కయిదాయె దివసంబులయ్యె నడవి నె ట్టులయ్యెనోహా। ఘనముగానుభవిని మనియుండిమరలనా। కను లకెపుడువాడుగానబడునె॥

* సత్రాజిత్తుదర్వు - పున్నాగరాగం - అటతాళం. *

ప॥ తమ్ముడు తిరుగనాదరి జేరడయ్యెచి। తమతల్లడించె దైవమా।దైవ మా॥ఉ॥గ్రమ్మవేటతమకమ్మునాతండుమమ్మురచెనేమో॥ దైవమా। దైవమా।వంటరిగాబోవుచుం టేమిగులవ।ద్దంటేవినడాయెగా।దైవమా దైవమా।యింటికి రాడాయె నే నేమి సేయుదు।దంటబాపితివె దైవమా। దైవమా॥ ౧॥ వితతశార్దూల। ద్విపశల్యచమరిసం।తతులచే దగిలెనో దైవ మా। దైవమా।రతిదైత్యసింహాత।రక్షుకాసశరభ।తతిచేజిక్కెనేమో దైవమా।దైవమా ॥ ౨ ॥ తపనుడిచ్చినమణి।దాల్చెదానికై తలద్భంచి నారేమో దైవమా। దైవమా । విపరీతమాయెను।విధికృతమేమందువి చరింపశక్యమె దైవమా।దైవమా ॥ ౩ ॥ నేటికిరాడిక నేటియూసవా ని। ఘాటిజూతునులేదో దైవమా। దైవమా। సాటివారిలోనేనీపాటివి

చారము। దాటనోపనైతి దైవమా। దైవమా ॥ ౪ ॥ నరహరి నామది
గురుతెఱుంగక యి। త్తరినెవ్వ జేసెనో దైవమా। దైవమా। దఃలియఁడ
వికి సోదరుఁడు జనినవెనక। తరినేవార్తయుఁదెలియ। దైవమా। దైవ
మా॥ ౫ ॥

*** సత్రాజిత్తుప్రార్థన - తేవారం. ***

సరస యోగీశ్వరేశా సన్నుతామరరమేశా। వరకృపాదృష్టి జూ
పి వంతయంతయునుబాపి। యఃసినాదఃకిడాసీ యనుజగానంగజేసి।
నరహరీచిత్స్వభావా। నన్నుగావంగరావా॥

*** పంచచామరవృత్తం. ***

పురారివంద్యమీపదాబ్జ పూజచేసిలోకమా। దరంబుగాను సృష్టి
జేసెధాతనేతబ్రీతిచే। కరంబు నాదరంబుజేసి గావుమట్లగొల్వనే। న
రుండ నెంతవాడనింగనంగనంబుజోదరా॥

*** సత్రాజిత్తు ద్విపద ***

తమ్ముడా వేటకుదరలుచుండగను। సమ్మతించకనీవు ఛనవద్దటంచు। ముమ్మా
రుబోధించ మూర్ఛించితీవు। నెమ్మదిగని రావు నేనేమనందు। హాసుంద
రాకార హారణశూర। హాసుకుమారహాయమితవిహార। వసుధైక వీర
హావనధిగంభీర। యసమానధీర హాహాయిందు రార। వైరమ్ముచేత నీ
వారికిగాని। కారడఃకిపాలుగాగలిఖించె। బలసియానలువేమిభాగ్యం
బునొందె। ప్రళయమందునతాను బ్రతికియుండేనె। ఒరులు నీమేల్మిని
యోర్వంగలేక। సరగున నెవరునింసాధించినారో। ననుజూచిహరిమణి
నాకిమ్మటన్న। మణినొసంగకినేనుమరలివచ్చితిని। దడవగానతడెమా
తమ్మునిద్రుంచి। పుడమినమ్మణిగొని పోవగనోపు। నిదిసత్యమిక నెవ్వరిట్టి
చెయువులకు। ముదమునొందరుకృష్ణమూర్తియుదక్క। మానహీనుఁడు
లేనిమర్యాదవాడు। పూసికెగురుదైవములు లేనివాడు। కులగోత్రము
లులేవు గొల్లడీతండు। దలపగోవులగావ దగినట్టివాడు। వావివర్సలుతే
క వనతలగూడి। కావరంబున నింతగానుతానడచె॥

సం॥ధి॥ అని సత్రాజిత్తుండు స్వామి నిందజేయు నవసరంబున నే తత్పట్టణాధీశ్వరుండగు నుగ్రసేనుండు॥

ఉ॥వ॥ రాజులకుచారుల నెడి చక్షుస్సుల వలన। వ్యవహారంబుల నె రవేర్చుట కర్తవ్యంబుగాన చారులవిచారింపవలయు చారులబిలుపిం పుడీ మంత్రిపుంగవులారా॥

మం॥ ఏ॥ మహాప్రసాదయా రాజవల్లభా॥

సం॥ వ॥ ఇట్లు మంత్రులవలన దెలుపబడి చారులువచ్చు క్రమం బెట్టులనిన॥

చారులదర్వు - ఝంఝోటిరాగం - ఆదిచాపు తాళం.

ప॥ చారులమయ్యా ॥ఉ॥ చనుదెంచినారమయా॥చేరికొలచిరాజేం ద్రునిమనమిం।పారగలోకము నరసిదెల్పదగు ॥ చా ॥ ౧ ॥ నరహరిప దముల నరసిగొల్చిపలు। మరుస్మరింపుచును। మరిమరివచ్చిన ॥చా॥౨॥

సంధి॥ వ॥ ఇట్లు చారులరుగుదెంచిన॥

మం॥వ॥ తమ దర్శనంబునకు చారులు వచ్చియున్నారయా ధా రుణీశ్వరా॥

ఉ॥ వ॥ ఓచారులారా

చారులు॥ స్వామీ॥

ఉ॥ కం॥ మనపురవరమునగలిగిన। జనముల వార్తలువినంగ సమ్మ తిబుట్టెన్ । గనుకవినవలతుమీరలు । జని తద్వార్తలను దెలసి తడ యకరండీ॥

ఉ॥ వ॥ మనపురంబునంగలిగిన జనవిసరంబు లెట్లెట్టుల జరింపుచు న్నారో।రాష్ట్రంబులెమ్మెవ్యవహారంబులచే నడుచునో అరసిరండీ చారులారా॥

చా॥వ॥ మహాప్రసాదయా రాజశేఖరా॥

సం॥ వ॥ ఇట్లు చారులరిగి ప్రచ్ఛన్నంబుగా వ్యవహారంబులెల్ల న రసివచ్చిన॥

ఉ॥ వ॥ ఏమేమి విశేషములు వినవచ్చితిరి చారులారా॥

చా॥ వ॥ పురంబులో వినదరంబుగాని వక సమాచారంబువిని వచ్చినారమయా రాజేంద్రా॥

ఉ॥ వ॥ అదియేమిటిదో వచింపుడీ చారులారా॥

చా॥ శా॥ సత్రాజిత్తనువానితమ్ముఁడుమహా సత్వంబుతో వేటకున్। చిత్రంబైనశమంతముం గళమునం జెల్వొందగా నేగినం। ధాత్రిం గృష్ణుడు వానిఁజంపి మణియున్ దాదెచ్చెనా వింటిమో।ధాత్రీవల్లభ యింతకంటె వినలేదన్యంబుమీధారుణిన్॥

చా॥ వ॥ సత్రాజిత్తు తమ్ముడగు ప్రసేనుండు శమంతమును తన కంఠమ్మున ధరించి వేటకమ్మున వనమ్మునకుబోగా। వానివధించి యామణిన్గ్రహించినాడీకృష్ణుండు వీనికిన్ నీతిగలదా యన వింటిమోధరాతలేంద్రా॥

ఉ॥ వ॥ అహహ యేమేమి మనపరిపాలనలో నింతమాటబుట్టుచున్నదా కానిమ్ముకానిమ్ము।అంతకూసర్వరక్షకుండగు శ్రీకృష్ణుం డేగలడు॥

సం॥ వ॥ అనియుగ్రసేనుండుబలికినవిని రామకృష్ణులు వివర్ణతనొంది॥

*రామకృష్ణుల సంవాదం - దేశీయ జంఝూటి రాగం - ఆదితాళం.*

కృ॥ ప॥ అన్నా యింతగానేన్నెనాస త్రాజిత్తుడు। అన్నన్న తన మంచిజెప్పినందున నిందజేసెనో।యన్నా॥

బ॥ ప॥ అనుజావినుమీ మనజులమాటలకేమి కనిలేనినిందగల్గిన కారణము దెలియబల్కు। మనుజా॥

కృ॥ చ॥ అన్నాయీనిందనే నెన్నికసేయకున్నను।మన్ననజేసిలోకులునన్నెన్నుదురే యిన్నేలనో।యన్నా॥ ౧॥

బ॥ చ॥ అనుజానీవుతన యభివృద్ధిగోరి చెప్పిన। పనికీనిందజేసెనునన్మణి। మనకుగావలెనయో।యను॥ ౨॥

కృ॥ చ॥ అన్నామనకేమనియున్న మానకలోకులు। నన్నేనిందింతురు మణినాదరినున్నదందురో। యన్నా॥ ౩॥

కృ॥ద్వి॥ అన్ననాపల్కుల నాలింపవయ్య। పన్నుగాకైలాసపట్టణంబునను। శంకరుండిభదైత్యు సంహరించుటకు। శాంకరితో జెప్పి చనియున్నవేళ। నగజతైలాభ్యంగనమున నలుంగు। నొగిబొమ్మగా క

బుగబోసి యతనిచే నొకఁ । కత్తియొసంగి వాకలిగాచియుండు।మిత్త
రి లోనికినెవరిరానీక । యనినమంచిదటంచు నతడట్లయుండ। దనుజ
నివహియించి దగవ్రిమధాళి।కొల్వగా కైలాసకుధరంబునకును। చెల్వు
మీరగవచ్చి శివుడులోపలికి। బోవబోవద్దని బోనీకబాలు। డావేళనం
దరనదిమివ్రేయగను। వ్రేటులుబడలేక వెనుకొనిశివుని। తోటిజెప్పను న
ద్భుతమునుకోప। మావహింపగత్రిశూలాగ్రంబుచేత । జీవంబువోనే
సిశిరమూడజేసి। లోపలికేగినలోలాక్షి దెలసి। కోపంబుచేలోకకోటు
లనెల్ల । భస్మీకృతంబుగాబడజేతుననిన । విస్మయాకలితుడై వేగమశి
వుడు । గజదైత్యుతలబాలు కంఠమంచుంచి । గజబిజియణగించి కలికి
బాలకుని । బ్రతికించెమరలను బ్రహ్మాపూర్వాయు। వతనికిచ్చెనుప్రమ
థాధిపత్యంబు । శివుడిచ్చెవరములు శీఘ్రంబుగాను। దివిజులుశక్రాది
దేవతులెల్ల । నాతనికిచ్చిరి యతడాదిపూజ్యు । డైతగనుండె నత్తరిజ
గమందు । వైనాయకచతుర్థి వచ్చినజగము । లోననాతనిపూజ లా
నరింపనతడు ॥

కృ॥ గీ॥ మోదకంబులు భక్ష్యభోజ్యాదులాది । ముఖ్యవస్తువుల
ర్పించిపూజజేయ । జొక్కికడుపార తామెక్కివెక్కసమున । రజతగి
రికడకరుగనారాత్రియతని ॥

కృ॥ కం॥ గనిచెంద్రుడునవ్విననా । తనిగర్భము పగిలి భక్ష్యతాన్న
ముధగనైపై। బెనుకొండలవలెబడగా। పనిచెడియాతఁడు భూమిపైబడె
నంతఁ ॥

కృ॥ కం॥ తనయుండిట్లవుటయువిని । ఘనశోకము మోహమొం
దికడునద్రిశశిం । గనిధర లేకుండంగా । ఘనశాపం బివ్వబ్రహ్మాగని పా్రి
ర్థింపఁ॥

కృ॥ కం॥ వృద్ధిక్షయములు గల్గివి।శుద్ధమతిన్నెలగుమనుచు సౌరది
బలుకుచుఁ । సిద్ధము నీతిథిచంద్రుని। యార్థతిగనువారు నిందనొందుదు
రనినఁ॥

కృ॥ కం॥ వనజజుడు విఘ్నపతికడ। కనువుగజని యవట భక్ష్యతా

న్నము మగుడం। జొనిపికడుపు పన్నగమూల । ననువుగబంధించి తెచ్చి
యంబకొసగెతాఁ॥

కృ॥ గీ॥ వెలయుబృందావనమున నేమెలగుతరిని। సలలితంబగు గ
ణపతి చవితియందు । పాలుబితికింపఘటములోపలను చంద్రు।గాంచత
త్ఫలమిప్పుడు । గాననయ్యె॥

కృ॥ వ॥ గాన యీనిందనుబాపుటకై।బూని యడవికిబోయివచ్చె
ద నిక్కడ జాగ్రతగానుండుమా యగ్రజా॥

సంధి॥వ॥ అనియన్నతోబలికి తగినవారలంగూడుకొని॥

* సంధిదర్వు - పంతువరాళిరాగం - ఆదితాళం. *

ప॥ అడవికై వెడలివచ్చెను । శ్రీకృష్ణమూర్తి॥ అడవి ॥ ఉ ॥ వడిగ
వడిగతన వారిగూడుకొని। పుడమిప్రసేనునియడుగులరయుచును ॥ అ ॥
పరమపావనచరితుడు। కామితజన। వరదుడు శుభభరితుడు।సరవిగా
నుతను సర్వజ్ఞుండై। పరివారములకు నెరుకపరచుటకు ॥ అ ॥ ౧ ॥ స
జ్జనావనయుతుడు।సకలమునకుగురుడై।ముజ్జగమేలువాడు। బొజ్జలోపల
భువనజాలముల।నుజ్జగించి వెలివెలిగించెడిధీర ॥ అడ ॥ ౨ ॥ జలజలో
చనుండు। మదయుతరిపు।జనవిమోచనుండు । సలలితమునిహృజ్జలజబం
ధుడగు లలితరుక్మిణీలలనాపతియపు॥ డడవికై వెడలి ॥ ౩ ॥ వసుదేవ
దేవకీసుతుడు।వివరింపగదా। నసమాస్త్రినకు గురుడు। అసమ విక్రము
డు హరిహయనుతుడును । నెసగినట్టితననిందబాపుటకు ॥ అడ ॥ ౪ ॥
శృంగారసంయుతుడు।మంగళాద్రిన్ర।సింహస్వరూపకుండు।సంగరహి
తుడున।సంగవర్జితుడు।గంగాధరనుతఘనపదయుగళుడు ॥ అడవి ॥ ౫ ॥

సంధి॥ గీ॥ అచటనచటను నడవిచొప్పరసికొనుచు । ఖచరవాహ
నుడాయట విచరుడగుచు । ప్రచురమతి కడుదూరంబు ప్రజలతోడ।గు
రుతుగనరాకదిరిగెనా కుధరధరుడు॥

సంధి॥ గీ॥ మానుగాతనవారు ప్రసేనుజాడ । ముందుజనిదెల్పగా
నుపూర్ణేందుముఖుడ । మందగమనంబుననువనమధ్యమందు । జెంది
వెదకుచు గనరాకముందుగనెను॥

*కృష్ణపరిజన సంవాదదరువు - శుద్ధకాంభోజి రాగం - అటతాళం*

ప॥ చ॥ అదిగో యిదుగో జాడ।అదెయిదెవోరి కెనుసదయ గన్గొనుమీకృష్ణా॥

కృ॥ చ॥ వదలక గాంచుడీయదను గనకుసం।ముదముచేకూరగను॥౧॥

ప॥ చ॥ ప్రాణవిహీనుడై బడియుండెనశ్వమి।దే నాజాడ గనుముకృష్ణా॥

కృ॥ చ॥ గానవచ్చెనిదెగా।వానియశ్వము।బూనికంటిమి నేడు॥౨॥

ప॥ చ॥ పటుతరమగునీ।వటముక్రిందనెవరో। బడియుండె నితడే వా కృష్ణా॥

కృ॥ చ॥అటుయిటుబోకరండిటవీనికిముక్తి ఘటియించె గా బ్రహ్మా॥౩॥

ప॥ చ॥ యేమూలమువీనికిట్లాటికలివచ్చె నెరిగింపవయ్యాశ్రీకృష్ణా॥

కృ॥ చ॥మానుగనిటవచ్చిమడియజేసిహరి।మణిని హరించెనుగా॥ ౪॥

ప॥ చ॥ అట్టిదేవమణిబట్టిన వీడెట్లు।నడపి మోసమునొందె కృష్ణా॥

కృ॥ చ॥ మట్టుమీరి గానిమయిలపర చివీడుబట్టుటనిట్లాయె నేడు॥౫॥

ప॥ చ॥ మననెందడప్పించు । మార్గముగనుపించె । మణిగానరాదయ్యె కృష్ణా॥

కృ॥ చ॥ మణికోరకై సింహామునుద్రుంచి యొకవెల్గు। మంటిమణిగ్రహించెను॥౬॥

ప॥ చ॥భల్లుక మెటుబారె।పరగ గానగరాదుపరికింపుమా నేడుకృష్ణా॥

కృ॥ చ॥ వల్లెగనుంగొంటివరగుహాదీనిలో।వనచరముండునుగా॥౭॥

ప॥ చ॥కోనమీరినకొండలోనికిజనిమణి। గొనివత్తుమో నేడుకృష్ణా॥

కృ॥ చ॥బూనహరికృప నేనేగిగొనివత్తు।గాన మీరిటనుండుడీ॥౮॥

కృ॥ గీ॥ మోదమునమీరలిటగుహాముఖమునందు । జేరియుండుడు మేజనిశీఘ్రముగను। మీరిమణిగొని మిమ్ముల జేరవత్తు। కడకతోడుత గుహాయెల్లగలయ వెదకి॥

కృ॥ వ॥ అప్తవర్గంబులారా మీరీగుహాముఖమందు ప్రదీప్తచిత్తులై।యేనీగుహాలోనికిజని మణిదెచ్చెడి పర్యంతంబిచ్చటనుండుడీ॥

సంధి॥వ॥ అనిపలికివారలగుహాముఖంబున నునిచి।వనజాక్షుండై

నకృష్ణుండు తమఃపరిపూర్ణంబైన గుహాంతరాళంబున|జొచ్చియక్క
డనొక్క బాలికతొట్లెపైవిలాసకంబుగా వ్రేలంగట్టిన మణిగనె
నంతట యొక దాదిబాలికతొట్లెయూచుచు టబాడె నెట్లనిన॥

* దాదిదరువు ముఖారిరాగం - ఆదితాళం, *

ప॥ ఈమణినీదేబాలా। మణినింపుగజూడవసేలా॥ ఉ॥ కామితఫల
ములుగలుగగజేయును। సోమసూర్యప్రభానుహితంబగు ॥ యీ॥ సో
దనమేలనేసుదతీ।వ। మోదమెుదవే పడతీ।అద్రిపసేనునిహరిహింసిం
పగసాధించిభవజ్జనకుడుదెచ్చెను॥ యీమణి ॥ ౧ ॥ చెలగుచుమణికై
జూడుచూచి।చెలగిచెలంగుచువాడు। కలికినీకైపటనుకంబుకంబుక్రియ।
వెలయగతొట్లెకు వ్రేలంగట్టెను॥ యీమ ॥ ౨ ॥ అలజడి బడకే చెలి
యా।నీ।వాడుకొనవె యింపొలయా।బలవంతుండగు।జాంబవంతుడిట।న
లినలోచనా।నన్నుంచెనుగదె ॥ యీమ ॥ ౩ ॥ పలుకుము వినవేకలికీ।
నీ।కలుకలేలెపూములికీ।ములకనగవుతో। మురిపించునరహరి।గలసియా
లరెదవు।కళవళమేటికి॥ యీమణి ॥ ౪ ॥

* దాదిదరువు - పున్నాగరాగం అటతాళం. *

ప॥ అడలకెబాలనీమదినింత।నలుగనేల ॥ ఉ ॥ అడలనీక నిన్నా
డించుమనుచునీ।కడనన్నుంచెగదె।కలికినీజనకుడు॥అడల॥ మదిలోనినా
డు।నీకెమటశ్యమంతముజూడు। బడిబడిమిూతండ్రిభల్లూకమహరాజువి
డువకనేడెంతో వేడుకజూచునే ॥ అడలకే ॥౧ ॥పంతమిదేలె యీవేళ।
యీరంతునీకేలే।సంతసమునసుశ్యమంతముజూచుచు। మంతనమునసీ।
మదిచింతలనుడిపి ॥ అ ॥ ౨ ॥ కనకాంగిరావే।నీ।తోనాడు।కాంతగూ
డవే।కినుకేలెమంగళగిరివరుకరుణనే। మనిజెప్పకునునీ। యంతరంగము
గంద । నడలకే ॥ ౩ ॥

* సంధిదరువు - శహనారాగం - ఆదితాళం. *

ప॥ నందసుతుండానందుడై మహా । నగము బిలముజొచ్చెన్ హె
చ్చె ॥ ఉ ॥ బృందారకవందితపదకమలుం।డిందిరావరుం । డిభరా
ట్పాలుడు ॥ నలిననయనుడా।నతదేహుండైనడచిబెలుచరాగా।బాగా।

జలజాతాయతలోచనయగు వలజాంబవతిచోలికపైమణికని॥నంద॥ ౧॥ సదయుడుతనసుదిముదమునొందనటదాలి। గదియరాగా వేగ।సుదతివద్ద నున్నదాదిడెందము । బెదరి।బెదరసాగె। వాగె॥ నంద॥ ౨॥ పతిత పావనుడు మంగళగృహము।బలముదెలియలేకా। కినుక।మణిచేతనుదాని దాదిభయపడి।మరి మొరలిడె।గనగావినగా ॥ నందత ॥ ౩ ॥

సంధి॥వ॥ అంతనద్దాది మొరయాలించి। కినుకమదిగీలించి బలవంతుండయిన జాంబవంతుండు॥

జాం॥వ॥ ఛీఛీ యెవడవురానీవుమణిగొనిపోవుటకైజనుదెంచితివటరా॥ నిల్వరా॥

* జాంబవంతుని మత్తకోకిలావృత్తం. *

ఓరిమానవ మూఢనీవిటు నెంపశక్తుడ వేననీ। చారుశౌర్యమునిల్పుమిక్కడ జాంబవంతుడనైననం।జేరవచ్చునె యెంతవారికి శీఘ్రమేనను గెల్తునీ।స్ఫారమానవకోటి యుద్ధముసల్పనెంతటివారురా॥

శ్రీకృష్ణుని మత్తకోకిల.

పాపపోక్తులు చాటిగాదిక భల్లుకాధమునీవునన్। మారుకొంటకు నానెనీగతి మాయమాటలజేరిలెదా।సారహీనుడవైననీవిటజాలు దేనను నెంపవా।గ్ధీరతన్దగదురనాడకుద్వంతునాహవమందునన్॥

జాం॥ద్వి॥ ఓరోరి కుమతినీవొకమానిసుడవె। నూరేమిపేరేమి। యుక్కిపట్టెచట।చోరవృత్తినినాదుసుతగృహంబునకు।చేరిమానికమును చేపట్టతగునె।జిక్కితివిక నెందుజేరంగగలవు। నిక్కముగానిన్ను నిక్కడద్రుంతు। చక్కగానిలుమోరిలసాగిపోనివను।నెక్కడడాగెదు యెయ్యెదిదిక్కు। జలధిలోజేరనచేరిపట్టెదను।కులగిరిమైనికుకొన్న నేవిడువ। బలమునభువికిరిందుబారినగొనుము। బలున్నకేసరివైనబరిమార్చి వేతు।నరయబికుడవైన నంతకుజేర్తు। పరశువాల్చిననిన్నుభంగించిపుత్తు। నరధిబంధింపగ జాలినమెచ్చ।భరమగుహలము చేపట్టినవిడువ। ఖలపరిఖ్యుడనంచు నెంచినవేరితు।కలికిచేష్టలుజూపక దలనిచ్చెదనె।నిలుతువే నాముందునీరదాకార। పిలయూంతకునివంటివిక్రమయుతుడ । నీబలంబవి

మెంతనీకులమెంత। నీబవరంబెంతనీజయంబెంత। నీపౌరుషంబెంతనీక్ష
లమెంత।యీపట్లనాతోడనెదురంగగలవే॥

కృ॥ద్వి॥ పెకలుప్రేలుటప్రియమగుఁగటర। నక్కయు కరియు
గానగసరియౌనె। అక్కజంబుగ సింగమగునెతోజేలు। బక్కసింగము
బట్టిభంగించినట్లు। నన్ను మోర్వగ తెంపుననుదలంచితివై। యెన్నగానీ
వెంతయుస్సిరోపోర। గిరిచరంబులు నన్ను గెలువంగగలవె గిరిచరాధమ
పొమ్ము గెలుః నీతరమా। భీమ్ముగంబులబెదరించినట్లు।నాతోడబోరాదోన
గచరనీవు। మేలకల్పాంతాగ్ని నేసంహరింతు। చాలుచాలిక బల్కు జా
లవుపొమ్ము। కాలుద్రైననుమమ్ముగదయగాదరమ। పోలింపనాసాటి బో
లుదేనీవు। యెదురుతన్నాగిపోరెయ్యెడనైన। గదసినజయమగు గదశూ
రులకును। కుతలమంతయునిండికొనియుండినట్టి। వితతపౌరుషములమీవె
రుగవామమ్మ॥

సంధి॥ వ॥ అనిపలికినశ్రీకృష్ణుని పలుకులువిని దండతాడితంబైన
భుజంగంబుభంగి ప్రదీప్తాగ్నివలె కోపానలజ్వాలాభీల లోచనుండై
జాంబవంతుండు॥

* సంధి దరువు - దేవగాంధారిరాగం - ఆదితాళం. *

సమరమొనర్చిరిగా। గిరివరుఁడుకృష్ణుడు ॥ సమర ॥ తమ యిరువురి
యార్భటులకు గిరిగుహా।తటాల్ దిటేల్ ఫెటిల్లనుచును।మెరయగ॥స॥
కరీకరిబోరువిధీని।వనమునను।హరీహరిజేరుకరణీ। కరకరినిరువురుకఠి
నాస్త్రమ్ములు।బరపినతలకొనిభగాల్ భగీయన॥ స ॥ ౧ ॥ పౌరుషోక్తుల
దరమి।సరాసరి।నిరువురుబోరుకలిమి।భారమనక నిరుపక్కలగిరికొని।చే
రికొను నెడల।శబాష్బళీలను ॥ సమ ॥ ౨ ॥ బాహాబాహిలము వెలగు।నర
హరినిగలసితన।సాహసంబు తెలియ। మోహరించియొకని। కొకరుజయ
సమ్మోహమొప్పనగముబగులదగులుచు॥ స ॥ ౩ ॥ సమముగ బోరుదు
వె। నీవునా।సరణికితగువాడవె। సమముగానిమంగళాద్రినరహరి। చర
ణమానయము జెర్పదననుచును ॥ సమరమొన ॥ ౪ ॥

* యిరువురిసంవాదదరువు - సౌరాష్ట్రరాగం - అటతాళం *

జాం॥ చ॥ నాపోటు జూడరా। నలినాక్షుయిదియాని। స్నేహమ
చు పురుషోత్తమా॥

కృ॥ద॥ యీపట్లనాపోటు జూపితిడెనినిబావుమఃభల్లూకమా॥ ౧॥

జాం॥చ॥యిదగోగానాచేతి బిదురసమానమౌ వ్రదరము పురు
షోత్తమా॥

కృ॥ద॥ అదరకుదానినేవిదళించితిడెనింక।వదలకుభల్లూకమా॥ ౨॥

జాం॥చ॥ వెనువకనాచేతిపరిఘమేసితిదీనబరువకు పురుషోత్తమా॥

కృ॥ద॥ పరిఘమునడుమను।విరిగిపోయెమా దరి రాకభల్లూకమా॥ ౩॥

జాం॥చ॥ముదమునానాచేతిగదవచ్చెనిలువుముబెదరకపురుషోత్తమా॥

కృ॥ద॥గదయేదారిబోయె।గానరాదుజూడగదరాభల్లూకమా॥ ౪॥

జాం॥చ॥ వాలాయముగబిండివాలమేసితిదీన।వారింపుపురుషోత్తమా॥

కృ॥ద॥ మేలుభళిభయమేలనల్లదియముని। పాలాయెభల్లూకమా॥ ౫॥

జాం॥చ॥ ఉద్గతినీపైనుద్ధతినేసితిముద్గరముపురుషోత్తమా॥

కృ॥ద॥ సద్గతిజెందెనీముద్గరాయుధము।చదలంచుభల్లూకమా॥ ౬॥

జాం॥చ॥వాయువ్యాస్త్రమునీపైబడగ నేసితి।చారకుపురుషోత్తమా॥

కృ॥ద॥ బాయకదానిపై పార్వతాశుగమేసిబాపితిభల్లూకమా॥ ౭॥

జాం॥చ॥ ఆగ్నేయాస్త్రంబిదె నడరించితిని ఈమహాగ్నిగనుపురు
షోత్తమా॥

కృ॥చ॥అగ్నిబాణముఃవారుణాస్త్రముచేజెల్లెనదరకు భల్లూకమా॥ ౮॥

జాం॥చ॥ నాగాస్త్రమిదెజూడు నగముపాములనిండ నరవీరపురు
షోత్తమా॥

కృ॥చ॥నాగరుడాస్త్రముననాగాస్త్రమిదెచెడె।నతివేగభల్లూకమా॥ ౯॥

జాం॥ చ॥ క్రమముననీపైసంతమసాస్త్రమువచ్చెగాచుకోపురుషో
త్తమా॥

కృ॥ ద॥ అమితమౌ సూర్యబాణాహతమయ్యె నరహరికృపభల్లూ
కమా॥ ౧౦॥

* సంధిదరువు - మారువా రాగం - ఆదితాళం. *

ప॥ దురమొనరించిరిగిరిచరకృష్ణులు। గిరిగుహాంతరమున॥ ఉ॥ మెరసియిరువదెనిమిదిదివసంబులు। సరిగబాహుబలమరుదై జూపగా॥ దు॥ అడిదములనుతరులణగిపోవసం।దడులు జెలంగగనూ। బెడిదములగుసని పిడుదివియకబలు।బిడుగులవడువునబడి మెఱుముష్టుల॥ దు॥ ౧॥ రణజయకాంక్షలనొకనికినొక్కరు। వెనకదీయబోక। మునుకొని తాకుచు మోహరించుచును మోహుబలులునై। ముదమునబెనగుచు॥ దు॥ ౨॥ పరమదయాళుడు।రుంగిళగినర।హరిశ్రీకృష్ణున।దురుగెలుగక నభిమాన ముపీడకను। కరమరుదుగదలకడచి తాకుచును॥ దుర॥ ౩॥

* సంధిదరువు - రేగుప్తి రాగం - అటతాళం. *

ప॥ మల్లయుద్ధము జేసిరీ।శ్రీకృష్ణుడు।భల్లుకుడును డాసిరీ॥ ఉ॥ మల్లజరచి దోర్వల్లికలనుబట్టి। యుల్లాసములను భాసిల్లుచు పొల్లుచు॥ మ॥ వల్లెయని మొనసీ। వారిరువురు। బెల్లురుకులగలసీ। వల్లడములదట్టి। దల్లడింపగజుట్టి। తల్లడింపకతమతలలుక్రిందుగ జేసి॥ మ॥ ౧॥ ముష్టాముష్టి నొాగి।నహార్నిశ।మునుదిక్కరులకుదగి।స్పష్టముగనృసింహ స్వరూపుడౌ కృష్ణు।ముష్టి దాకిసంపూర్ణశ్రీమము నొంద॥ మల్ల॥ ౨॥

సం॥ వ॥ ఇట్లనేకవిధంబుల శ్రీకృష్ణునితో భల్లూకపతిరణంబు చేసి తత్ప్రహారంబులత్యంతతీక్ష్ణంబుగా తాకిన నొడలెల్ల పిండిపిండియై। తెలివి దెచ్చుకొని। తన్నింత నొవ్వగు ప్రిద్ధినవాడు నరుండుగాడు తనపాలిటి శ్రీహరి గాబోలు। గాకున్న నరుండింత నొప్పించునాయని వివేకంబు గలిగి। రామావతారకథదలంచి జాంబవంతుండు స్తుతించె నెట్లనిన॥

* జాంబవంతుని ప్రార్థనదరువు - పున్నాగ రాగం - అటతాళం *

ప॥ రక్షించురక్షించుమీ। రామయ్యనను॥ ఉ॥ రక్షించురక్షించు దీక్షబూనినాపై।కక్షగట్టకను పేక్ష జేయకను॥ రక్షిం॥ అక్షయనామనపు న।లోకసం।హాత నేలినవీవన।అక్షీణపరమ కటాక్షవిక్షేపసం। రక్షితనిగమాధ్యక్షుడవీవేనా॥ రక్షింపు॥ ౧॥ కరిబిగావదినాథవు చక్రమునము। కరికృందినాథవు। వరుసగనేసేయువిరసమునీమది। పరుసమునకనీ స

రసతఁజూపించి॥ రక్షింపు ॥ ౨॥ నన్ను నేలినవాఁడవు। రామాయను। చున్న
వారలగాతువు। సన్నగానుదనుజ। సంఘముదుఃమిమూ। పన్నరక్షకుఁడవై
ప్రబలి యేలితివన్ను॥ రక్షింపు ॥ ౩ ॥ జలధబంధించితివీ। రావణుతల। లిల
వ్రాలఁగూల్చితివీ। వెలుచనలంకవిభీషణునకునిచ్చి। బలసిసీతతో పుష్పక
మెక్కితివిమున్ను ॥ రక్షింపు ॥ ౪ ॥ సాకేతపురమునను। రాజ్యమునొం
ది। సకలము నేలితివీ। కాకాసురునిగాచిఘనకీర్తిగనినావు। నీసనతులజేసు
నేమంగళాద్రీశ ॥ రక్షింపు ॥ ౫ ॥

జాం॥ ఉ॥ దేవదివౌకసుల్మునులు దిక్పతులార్యులు రాక్షపాళున్।
భావములందు నీదువిభవంబుగ్రహింపగజాలకున్నెడన్। తావకసత్వ
సారమును తార్కొకచేర్కొననెంతవాఁడనం। రావగబుట్టు దాశరధిగా
మఁదిదోచెఁజంబుజెప్ప వే॥

జాం॥వ॥ ఏమి యీవింత। స్వామీ। నన్నింతనొవ్వగ్రుద్దినవారలీ
ధారుణిగలరాగానని వునరుకవుగావు నాపాలిటి జానకీవరుడవని దోచె।
వదేమో నీవెవ్వరోకటాక్షింపుమా। స్వామీ॥

సం॥వ॥ అనినవినిభక్తవత్సలుండైన పుండరీకాక్షుండాతని దేహ
నిగ్రహంబు నివారించుకొరకు। తనహస్తంబున నతని మేనంతయుఁనివిరి
యుట్లనియె॥

కృ॥ కం॥ రామావతారమునసం। గ్రామంబున దేవశత్రుఖండించిజ
య। శ్రీమీరసీతగొనినిజ। ధామముజెందితిని నేయదార్థము వినుమా॥

. కృ॥ వ॥ రామస్వరూపమున రావణునివధించి సీతనుగూడి। సాకే
తపురమందువిఖ్యాతి। పదకొండువేలసంవత్సరంబులు రాజ్యంబొనర్చి
నవాఁడనే నేగాదా భల్లుకేశ్వరా ॥ మరియు నయ్యవతారంబున నీకొ
సంగిన వరంబు ఫలంబు నేఁడనుభవించితి నీమనోభీష్టంబుదీరెగదా॥

* కృష్ణజాంబవంతులసంవాద సీసం *

భల్లుకేశ్వరవినుపరిపాటివివరింతు మున్ను సత్రాజిత్తు మూర్ఖుఁడగు
చు। ఈమణిమాచేత నిమ్ముగాబడెనని తామసుండైతాను తగనినింద।
మామీఁదనిడె దానిమాన్పుటకై వచ్చి నీసుమాజొచ్చితినేర్పుమీర। నిగ్ర

హించితి నన్నను గ్రహంబున గోరు వరమొసంగెద నీకు పరమపుణ్యా! అని నన్నంజలిగావించి వనజనయను। చరణకమలంబులకును సాష్టాంగమెరగి। వినుతిగావించి దేవనా విన్నపంబు నవధరింపు డటంచు నయ్యాద్రిచరుడు॥

జాం॥గీ॥ ఎల్లసుఖములబడసితి నుల్లమందు। నొల్లనేరొక్క కోర్కి నా కొసగుమయ్యా। నవ్యయంబైన వైకుంఠనగరవదవి।దివ్యసన్నిధి దయచేసి దేవదేవ॥

* జాంబవంతుని దరువు - కళ్యాణిరాగం - ఆదితాళం. *

ప॥ మోసమాయెనయ్యా నీవునా। దాశరథివేయ్యా ॥ అ ॥ నీసరిదైవము నేగనకృపగై చేసిబ్రోవుమయ్యా॥ రామయ్యా॥ మో ॥ మానవమాత్రుడవు।నీనని। నేమారుకొంటినేతడవు।బూనిముందుని న్నెపుట్టినది మొదలు।పూజింతుగదయ్యా॥ రామయ్యా॥ మో॥౧॥ వాసవార్చితుడవు। రణవిధ్వస్తరాక్షసుడవు। నీసమానులను। నేనలగానక। గాసికొంటినయ్యా॥ రామయ్యా॥ మో ॥౨॥ పరమపావనుండవు। పరుండవు। పంకజనేత్రుడవు। అరమరసేయక ఆదరింపు శ్రీకర రవికుల తిలకా ॥ రామయ్యా॥ మో॥౩॥ ఆర్తశరణ్యుండవు।జగదాధారకారణుండవు।మార్తాండతేజా నీ।మహిమ తెలియలేక।ధూర్తుడనైతినయ్యా। రామయ్యా॥ మో॥ ౪ ॥అపరాధిని దేవ।నన్ను సత్కృపచేతను బ్రోవా।నిపుణుండవు నీవు।నగ్రహించితినన్ను।కృపచేతవ ంగళగిరినిలయ॥ రామయ్యా॥ మో॥౫॥

సంధి॥వ॥ అనియనేకవిధంబుల బ్రస్తుతించి నమస్కరించి। మణిని జాంబవతీకన్యకామణినింగొనివచ్చి హరిపాదాంతికమందుంచి మరియు జాంబవంతుండిట్లనియె॥

* జాంబవంతుని రెట్టింపుదరువు - ఫర్జురాగం - అటతాళం. *

ప॥ సుతనిచ్చెద సమ్మతిగైకొనుమీ ॥ వితగాదికని న్వేడెదా బాడెదా॥ సుత॥ నతిజేసెదనానుతిగైకొనియే।గతిగాచెదో నీమతినీరతినీ॥సు॥౧॥ మణినీదేగా।మముగావుతగ। అణిమాదికసిద్ధయైశ్వర్యగదా॥సు॥౨॥ ననుబ్రోవకయున్నను న్యాయమా । వనజాక్షదయా । వనధేధీశంధే ॥ సు ॥ ౩ ॥ పలుమారునునీ। పదభజనమెగాని। దలచగనరలేని।దాసుడానంటినిగాని ॥ సు ॥ ౪ ॥ జూడగానేకాని । వాడనావేడనా । తో

తోడుసీడగనా। తోడబల్కు నరహరి॥ సు ॥ ౫ ॥

జాం॥ వ॥ మణియు నీకన్యకామణియు । గ్రహించినీమనమునసను గ్రహించుమా శ్రీకృష్ణా॥

సం॥ధి వ॥ అంతట శ్రీకృష్ణుండు మణియునుం గన్యకామణియు నుం బరిగ్రహించి గుహ వెడలి ద్వారకాభిముఖుండై జనుదెంచుచుం డె నంతకుమున్న॥

సం॥ క॥ అంత గుహాముఖమునయందు । సంతతిపదిరెండు తిథులు జనుదాకా శ్రీకాంతుడు రామికితమమది। చింతా క్రాంతాత్ములగుచు చేరిరిపురమున్॥

సం॥ వ॥ అచ్చటనున్న దేవకీ వసుదేవులకు నుగ్రసేనునకు। గుహ జొచ్చి కృష్ణుడు రాడు జిక్కెనని చెప్పిన। వారును నాహ్లాదంబులు విడచి చింతాకులమానసులై విలపించుచు చండికాలయంబునకుంజని వేడుచు న్నసమయంబున నందు రుక్మిణీదేవి ప్రార్థించె నెట్లనిన॥

రుక్మిణీదేవి దర్వు - శహనారాగం - ఆదితాళం.

ప॥ చండికనాకేమి సెలవుదయచేసేవమ్మ ॥ అ॥ పుండరీకాక్షుడు కొండజేరి రాడాయె॥ చం ॥ అసమానబలుడురా। తుసవై వాహికము న। పసమీరగనుశిశు। పాలాదులగొట్టెనమ్మ ॥ చం ॥ ౧ ॥ ఘటనాఘ టనముసంఘటనా మొనర్చు శౌరి। చటులపరాక్రముడే । కుటిలుని చేజి క్కెనో ॥ చండిక ॥ ౨ ॥ పూతనాదిరాతుస । వ్రాతమడంచెనమ్మ । యీతరివిభుడెందు। చేతరాడాయెనమ్మా॥ చండిక ॥ ౩ ॥ అండజవా హనునా। దండజేర్చవేమమ్మ। చండివానివదలి నేనుండజాలనోకొమ్మా॥ చం ॥ ౪ ॥ భండనభీముడు వే। దండవరదుడుప్ర। చండనరహరినినా। దండకుజేర్చవమ్మ॥ చండిక ॥ ౫ ॥

రుక్మిణీ తేవారం.

నా మొరాలింపవమ్మ। నన్నుమన్నింపవమ్మా । సామజవరదుడమ్మా। స్వామినన్నార్పవమ్మా। భామపలుకు వుగదమ్మా। భక్తినిన్నే మెప్పెదమ్మా। కా మితార్థంబులిమ్మా। కామసంహారునికొమ్మా॥

* పంచచామరవృత్తం. *

పరాకుశాయపాటిగాదు పార్వతీశ్వరియ్యడం। బరాబరుల్ చలం
గసీదుపాదముల్ దలంచెదన్।నిరాకరించకమ్మనీదునిత్యనామ మెన్నితిన్।
మురారియేలరాడె యోపురాసురారిభామినీ॥

రు॥ వ॥ పరాత్పరీ।మురారినిమాకనులజూపితివేని। సరాసరిని నీకొ
రకు జాతరజేసెదమమ్మా। పురారిగృహిణీ॥

సం॥ వ॥ అని దేవకీవసుదేవాదులును రుక్మిణియును చింతచేవేచు
చున్నసమయంబున దాసకల్పవల్లియగు కుమారునితల్లి యిట్లనియె॥

చం॥ ఉ॥ అన్యులుతల్లడిల్లగ భయంకరుడై రిపులన్ జయించియ।
న్యోన్యముదంబుతోనవమనోజనిభాకృతిబూని శౌరితా।కన్యకతోశ్య
మంతమణి కాంతులతో యదువంశపుణ్యురా। జన్యుడు కృష్ణుడిప్పుడరు
దెంచు నిజంబు నిజంబు నమ్మడీ॥

* చండికదర్వు - ఆరభిరాగం - ఆదితాళం. *

ప॥ చనుదెంచునదెచూడరె! శ్రీకృష్ణమూర్తి॥ చ॥ దనువుమీర
జాంబవతీకన్యా। మణితోమణితోఘృణులవెలగుచును॥ చ ॥ వనజనాభు
డడుగో। దాసకదంబ। వనజాప్తుడడుగో। వనరుహనేత్రుడు। దనుజాం
తకుడును। ఘననిభదేహుడు। గనుగొనిమ్రొక్కరే!! చ॥ ౧॥ దాసహృ
దయవాసుడు। కామితఫల। దాయి శ్రీశ్రీనివాసుడు। భాసమానుడు
ను। భావజజనకుడు। భూసురపాలుడు। భువనావరణుడు॥ చ॥ ౨॥ రం
గుమీరంగను। మంగళగిరీ। సంగరహీతుని। పొంగుచుదలచుచు। పూని
మ్రొక్కుచును। అంగజజనకుండల్లదెజూడరె॥ చ ॥ ౩॥

* సంధిదర్వు - హిందుస్తానిరాగం - జుల్వతాళం. *

ప॥ బాలకృష్ణుండడుగోవచ్చెన్। బాలికమణితోడన్। ఆలోలాక్షి
తోగూడన్॥ నీలమణిద్యుతులతోడ నింపొదవంగన్। బా॥ వనజనాభుం
డడుగొవచ్చెన్। గనరెమీరలెల్లన్। ఆ।ఘనునిచక్కదనమున్॥ సనకస
నందాదులెల్ల। సన్నుతిసేయన్॥ బా॥ ౧॥ కనకపీతాంబరధారీ। కౌ
స్తుభమణిహారీ। శ్రీ। కపటనాటకకారీ॥ వినతసుతావాహనుడై వేగ
మెవచ్చెన్ ॥బా॥ ౨॥ మంగళగిరినాథుమహిమ।అంగనకునుదెల్పి। శ్రీ

రంగజిరకుదెల్పి। శృంగారంబెల్లవెయి। భంగులగొనియాడి। చా॥ ౩॥

సం॥వ॥ ఇట్లు సర్వజనానందకరంబుగా కృష్ణుండు పురంబునకువచ్చి యొక శుభలగ్నంబునఁ బుణ్యదినంబున జాంబవతింబరిగ్రహించి రాజసభకు సత్రాజిత్తును బిలిపించి॥

* కృష్ణుదర్వు - సురటరాగం - ఆదితాళం. *

ప॥ కారణములేనినింద జేసితివి। మామీదనీవ। కారణముక్రోధమునకుడాసితివి ॥ ఉ ॥ మారుగానక ప్రసేనుడుమణితో। ఘోరవనములోగృహ్మాలగనొక। దారియతనిజంపిసింహమొక్కటి। శూరతనుదారతనుమణిగొనె ॥ కార ॥ అంతటనొకభల్లుకంబుజనుదెంచి।సింహమునువధించి।సంతసమున మణిగొనుచును మెలెంచి॥వింతజనములెవరికిజొరరానిగు।హాంతరంబునజొచ్చిగూతుతొ బ్లెశ్య। మంతమణినిగట్టియుండె నేనట।గాంతారమంతయునువెదకితిని ॥ కార ॥ ౧ ॥ నాతోడ వచ్చియున్నజనమ్ములను।గుహాముఖమ్మునను। చేతోముదముననుంచి యొక్కడను। భీతమయినగుహజొచ్చియామణి జేతనందువేళభల్లుకేశ్వరు।డాతతధ్వనులదార్కొనిననునే। నాతనితో కూతలిడబోరితిని ॥ కార ॥ ౨ ॥ నాపోటులకునిలువజాలకతడు।నను దెలసినుతింపగ।దాపోపశమనజేయగానబడు।రూపవంతమగు పాపనుమణియును।దాపుజేరియిచ్చె సంతసింపుచు।నాపరావరుడునరవారిసత్కృపనాపయింబ్రాపుసేయవచ్చితి ॥కారణము ॥ ౩ ॥

స॥ వ॥ ఈడుగానియడవికిబోయి। జాడజాడలను ప్రసేనుని జాడదెలసి। యెందునఁజాడగూడనిగుహాంతరంబుజొచ్చి। అచ్చటజాడగామాణిక్యమునుగాంచి హరింపదలంచిన।నేడనుండియొయొక వెలుగుబంటువచ్చినాతోడబోరె।నంతపోడిమిచెడగ్రుద్దితిని।నాభల్లుకంబుననుగూడిపోరలేక భయంబంది।తనకూతును యీమణిని నాకు గానుకగా నిచ్చెదెచ్చితినిదె నీమణిని పుచ్చుకొనుమా సత్రాజిత్తా॥

సం॥ వ॥ అనిన విని మణినిగొని సత్రాజిత్తుండు విన్నంబోయి ఖిన్నుండై తనయింటికింజని తనప్రియసఖితో నేమనుచున్నాడు॥

* సత్రాజిత్తుదర్వు - పున్నాగరాగం - అటతాళం. *

ప॥ యెంత మోసమాయెనే । యింతీలలామ॥ ఉ ॥ కంతుగురునిమ నసింతైన దెలియక । పంతగించి శౌరి। పావుడంటిని బుద్ధి॥ కెంత ॥ అంత రంబు దెలియకా। తమ్మునివలని। చింతదో)యజాలక । చెంత జేరగనుశ్య। మంతమిమ్మనిలక్ష్మి । కాంతుడడుగనింత గానిందజేసితి ॥ నెం ॥ ౧ ॥ పాపాత్ములగువారలు। పద్మాక్షునొక। పరిదలంచియఘములు। బాపజాలగనో పు। పతితపావను డెకృత। పావుడనుచు మదిభావించితిని బుద్ధి॥ కె ॥ ౨ ॥ అర్థలోభుడనైతినీ। శ్యమంతమ స్వర్ణ మొసగనైతినీ। వర్థతకామాదివర్గయు తుడహరినీ। పా)ర్థింపనేరని । పరమమూర్ఖుడబుద్ధి॥ కెం ॥ ౩ ॥ నిగమ వేద్యునిమనము। దెలియలేక। నేనిందపరచడము । పగజేసెనరహరిభావ మెరుగనైతి। మిగిలితినదియింత మిక్కటమయ్యెను ॥ యెం ॥ ౪ ॥

స॥ వ॥ నిందలేని హరిపైని వృథానింద జేసితిగదె మందయానా॥

* సత్రాజిత్తుదర్వు - ముఖారిరాగం - ఆదితాళం. *

ప॥ బలవద్వైర్యమొచ్చెనే। నెటులనైతు। భామానెమ్మదిమెచ్చెనే॥ ఉ॥ చలమునకృష్ణుని। సాహసాదిగుణ। బలము దెలియలేక పాపములా డితి ॥ బల ॥ కూ)రచిత్తుడనైతినె। శ్రీ)హరిమది। దుఃరమత్తుడనైతినె। భూరిసంసారాబ్ధి తారకుడనిమది। కోరినుతించక బీరములాడితి॥ బల ॥ ౧ ॥ దుష్టుడనే నైతీగా। పరమాత్ముని। యిష్టవరచనైతిగా । భ్రష్టులలోనక। నిష్టుడనైబుద్ధి। నష్టము చేతను నలిగిమిగిలితిని ॥ బ ॥ ౨ ॥ అన్యాయము జేసితి నరహరికృష్ణు। ఘనిదల్చగనైతీ। మాన్యతవానిసన్మానింపుచునునిల। ధన్యునైమనక యుదాసీనమాడితి ॥ బల ॥ ౩ ॥

స॥ ద్వి॥ యేమి సేయుదు నెయోయిందీవరాక్షి। కామిని హరికృష్ణు గానెన్ననైతి। తామసంబునమతిదప్పి దుష్టతను। నీమంబు జెడ హరినింద జేసితిని। యేమియుపాయ మోయెలనాగ జెపుమ। భామ నేదుర్బుద్ధి పాలయితినకట। తామరసేక్షణుదయ యెట్లుగల్గు। కామితార్థము యేగతికరుణించు। బలవద్విరోధమిభ్భంగిసంధిల్లె। కలికి శ్రీకృష్ణుతో కలహించుకతన॥

సం॥ వ॥ యేపాపం బెరుగని శ్రీపతిపై పాపంబుగలదని పలికి పాపంబునకొడిగట్టితిగదే భామాలలామా॥

సం॥ వ॥ అనినలలితాంగి భయవినయంబులు బెనంగొన ముకుళిత హస్తయై ప్రాణేశ్వరునిం జూచి। యిట్లనియె॥

*లలితాంగిసత్రాజిత్తుల సంవాదదరువు - శ్రీరంజనిరాగం-ఆదితాళం*

ల॥ప॥ నాథనాదుమనవి చేకొను। ఖేదమేలమాను॥ నాథ ॥

స॥ప॥ చాననేనేమిూ సేతునే। గానలోలుదూరితి। చాన॥

ల॥చ॥ మనుబ్రహ్మాదులు తనువంచింపగనూ। చనుపెంసంగి బ్రోవడె॥ నాథ ॥

స॥చ॥ అతిశయభక్తిసహితుడై వేడగనూ।సుతుడుగానబ్రోచె॥చా ॥౧॥

ల॥ చ॥ దోసమనకయాదవులనువాసవుడు। గాసిచేయగావడె॥నాథ॥

స॥ చ॥ సన్నుతాంగి మును పన్నగశయనునకూ। అన్నగాడె యిందుడు ॥ చా ॥ ౨ ॥

ల॥చ॥ కడుకూరుండగుకాళీయునిగాచె।గానమనలబ్రోచు॥నాథ॥

స॥చ॥ ఫణిసతులతిపతిభక్తితో వేడగనూ।భావమలరిగాచె॥చా॥౩॥

ల॥చ॥ మణికయ్యనసల్పినవనచరవరునీ।తనయనుగొనిగావడె॥నాథ॥

స॥చ॥ నిందదీర్చుకొనుచందమునకుగాదా।సుందరిమణిచేకొనె॥చా॥౪॥

ల॥చ॥నామాటలువినియీముద్దులసుతనూ।కామజనకుకొసగుము॥నా॥

స॥ చ॥ భామామణినేనేమనియొసగుదునూ। పామినిందజేసితి॥చా॥౫॥

ల॥ చ॥ చిన్నికృష్ణుడాపన్నశరణ్యుడనీ। విన్నవించినాను॥నాథ॥

స॥ చ॥ మన్ననచేసియీమణిసుతగైకొనునా।మంగళగిరిహరికృప ॥ చాననేనేమిూసే ॥ ౬ ॥

ల॥ వ॥ హరిపతితపావనుడనేబిరుదువహించె। నట్టుపరమపురుషునకరుణమరివడయగోరితి మేని। నాపలుకునిరసించకమణితోడ। సత్యభామామణిని గొనిచనిసమర్పించుదము। మానుపటికరుణారసంబుమనపైవచ్చు నింతకువేరెయుపాయంబులేదు। లెమ్మా। మనోహరా॥

సం॥వ॥ ఓహో హో యేమినాపుణ్యమింతి।యింతకంటె నుపాయమేమియులేదెంతచక్కనియోచనచెప్పితివే దంతిగమనా॥అనుచు పుత్రికారత్నంబునకుందగిన శృంగారంబుగావించి తోడ్తేరబంపిన లలి

తాంగి యపరిమితానంద భరితాంతరంగియై లతాంగినలంకరింపించు విధంబెట్టులనిన॥

సంధి॥ద్వి॥ అంగనలెల్లనువతివేడ్కఁగూడి। రంగుబంగరుబొమ్మరావమ్మకొమ్మ। అంగజగురునకిల్లాలివై వేగ। శృంగారవతిసిపల్ చేకొనవమ్మ। భామామణీసత్యభామరోయనుచు। శ్యామకు మంగళ స్నానమొనర్చి। కోమలాంగులుగంధకుంకుమాకృతులు। హేమముక్తికనీలహీరవైడూర్య।గోమేధికారత్నకుందారవింద। దామాబ్జరాగమందారపరిమళ।ఘనసారకస్తూరికాదులుపసపు। పునుగు జవ్వాదియుంబుష్పసారములు। గొనవచ్చిబలుతెరంగులనలంకార। మొనరింపదాల్చియమ్ముద్దియమెరసె। ననవిల్తువిరిబాకునకునుద్దియాచు। జననీజనకబంధుజనములానంద। వనధిని దేలిరవ్వనజాక్షి చెల్వు। గనుగొనిసఖులెల్లకడుసంతసిల్ల॥

సంధి॥ వ॥ తదనంతరంబున సభార్యుండై సత్రాజిత్తుండు సత్యభామాసమేతంబుగా మణినిగొనిచని వనజనాభుని పాదవనజంబులకనేకనతులుజేసి నిలచి॥

* సత్రాజిత్తుప్రార్థనదరువు - నారాయణిరాగం - ఆదితాళం. *

ప॥ శరణుశరణుశరణు। గోపాలకృష్ణ।శరణు॥ఉ॥స్మరవారార్చితగురుకృపాకర। కరుణాబ్ధివిముననరహరీ। వరదనీదుమహాప్రభావములెరుగ నపరాధముక్షమింపుము॥ శరణు॥ పతితపావనుడవు। ఆశ్రితజన। పరమమందారుడవు। గతియునీవనినమ్మితీసం।తతమునీపాదముల్। అతిముదంబునదలదిమొక్కుదు।ధృతగిరీ। నతకరీ।నరహరి॥శరణు॥ ౧ ॥పుండరీకనయనా।సకలబ్రహ్మాండపాలననిపుణా। దండిమీరగజేరితీనీ।యండనండజవాహనా। ఖండవిక్రమశ్రీహరీబ్రం।హాండనాయకనరహరీహరి ॥ శ ॥ ౨ ॥ ఆర్తశరణ్యుడవూ। ధరణియతి।భూర్తహరణ్యుడవు। కార్తికేయప్రముఖులు సుర।గరుడకింపురుషాదులు। మూర్తిమంతములెల్లనీవే।మురహరి।నరహరీ।హరిహరి॥ శర ॥ ౩ ॥ శరధీభవమనోహరా। చక్రధర।సరససుకవిమందారా। శరణునతకరు

ణామయాత్మక|శరణుసురమునిరతుకా|శరణుమంగళగిరిహరీ| హిత జయకరీ| కరుణాకరీహరి ॥ శర ॥ ౪ ॥

* సత్రాజిత్తుదరువు - ముఖారిరాగం - అటతాళం. *

ప॥ కావవేకరుణాబ్రోవవే| శ్రీకృష్ణనన్ను ॥ కావ ॥ భావజజనక నేనీభావముదెలియలేక|కేవలమునునుజుడవని|కావరంబుననింద జేసితి॥ కావవే ॥ పతితపావనుడవునీవెగా| శ్రితజన|పారిజాతమైతివి| అతులిత సుగుణసం|తతిచేతజగములు|సతతమువెలుగొందు| స్వామిసార్వభౌమ॥ కావవే ॥ ౧ ॥ నిరతము శరణనువారల|నెల్ల|కరుణబ్రోచెడి దొరవీవెగా| నిరసించివిడువక| నెరినాయపరాధములు| ధరిముష్టి తుమియుంచు దాతవీవెకాద॥ కావ ॥ ౨ ॥ సంగరహితులనుగావ|పుట్టి|మంగళాద్రి నెలకొన్నావుగా| శృంగారనవమోహ| నాంగయభంగభు| జంగతల్ప జయ| జయజయహరిహాయ ॥ కావవే| కరుణాబ్రోవవే ॥ ౩ ॥

స॥వ॥ కరిరాజుకొరకైకరికరినిమకరిద్రుంచిగాచితివీవే|కావవే|కావవేవరదా॥

సత్రాజిత్తునిసీసాధ్యం ఆనందభైరవిరాగం

సరసీరుహాతునీ చరణముల్గొలచితి కరుణించవేనాదురితహరణ| పతితపావననామపాథోధినిజధామసరసిజోదరరామసార్వభౌమ | పుండరీకదళాక్షుబుధజనాధ్యక్షుబ్రహ్మాండనాధుడవీవెయాదిదేవ| అపరాధజనుల నిరపరాధులనుజేయువరదుడవీవెకాదా|నన్నుమన్నించి| వరములొసంగరాదా॥ వరువమైనసత్యభామామణిని మణిని | మరికాన్కగావింతు|వరియించిబ్రోవుము॥దురితహరణ | భవతరణ శాశ్వతవి|తరణము క్తివనితామనోహర| శరణుశరణుమంగళగిరి నర| హరివరదయాపర|యవార్యగుణాకర॥ వరదుడవీవేకాదా॥

స॥వ॥ వననాభా| నామనవిచేకొని యీ| వనజాక్షినాసుత | సత్యభామను శ్యమంతకమణి యును| గాన్కగాగొని|యనుగ్రహింపుమా దీనజనావనా| ఆర్తశరణ్యా| దయానిధే॥

*కృష్ణసత్రాజిత్ప్రముఖులసంవాదదరువు-కాంభోజిరాగం-ఏకతాళం*

కృ॥ వలదువలదుమాకు|గలరుసత్కులకన్య| లలజాంబవతిరుక్మిణే

లనిది। లలితంపుభుజమూలములదండమంకించి । నలువందశరణార్థినను
టేలను ॥ వల ॥ ౧ ॥

స॥ జలరుహనయనన్నా। వలనగల్గినతప్పు। తమసేయుమనినీదు శర
ణంటిగా। కలరు కలరు నీకుగజయానలెందరో। వలసికోరినదానివలదం
దురె॥ జల॥ ౨ ॥

కృ॥ నిందమోపినవాని। పొందెట్లు జేసేగో।విందుడనరె బంధుబృం
దములు। కుందరదన యెంతసుందరివైన। నీనందనయందు రేమందున
యా॥ వల॥ 3 ॥

స॥ కందర్పజనకయీయిందువదననీదు। సుందరిగైకొనుముందము
గా।ఇందరిలోనీపైనిడిన నిందకుసిగ్గు।నొందితిగాదెముకుందాహరీ॥ జల
॥ ౪ ॥

ఉగ్ర॥ అపరాధివైనట్టి యలజాంబవంతుని । కృపజేసితద్బాలకిన్
గొనవే। కపటనాటకసూత్ర కంజాతదళనేత్ర । యిపుడువీనికభయమి
వ్వవయ్యా॥ అప ॥ ౫॥

బల॥ కాకాసురునిగాచె ఘనుడైనరాముడు। లోకులెల్లను మెచ్చ
గాకరుణా। ఆకైవడిని బ్రోవనగు వీనిమన్నించి। రాకేందుముఖనేలుర
మణిగను॥ కాకా॥ ౬ ॥

వసు॥ సుకుమారకొమరయీసఖిబోలుచెలులే। రఖిలలోకములం
దునరసిజూడ । అకలంకమతిదీని నంగీకరింపుమీ। సకలసద్గుణధామా
సత్యభామా॥ సుకుమార ॥ ౭ ॥

బల॥ తమ్ముడనీదుచి త్తమ్మునదీనినీ । సొమ్ముగగైకొని సుఖియింపుమీ।
యిమ్మానినీమాలీయిందిరామణిరీతి సమ్మతినీకెన్నసమమైనదీ॥తం ॥ ౮ ॥

దేవకి॥ చిన్నికృష్ణనన్నుమన్నించి యిప్పుడీ । సన్నుతాంగినేలు క
న్నతండ్రీ। పున్నమి జాబిల్లిబోలునీచెలిమోము । వెన్నెలలీనునీవెలది
మేను॥ చిన్నికృష్ణ ॥ ౯ ॥

రుక్మిణి ॥ ప్రాణనాథనిన్ను।ప్రణుతింతునీకీర।వాణియీవిరిబోణివలదన
క।మానినిక ళ్యాణమైమమ్ము బాలింపు।గానలోలనెరజాణయిది॥।ప్రా॥౧౦

దేవకీ॥ వనజాక్షి యీయింతి కనులుసిరులనీను। నెనరునవరియింపు నీవింకను।ఘనమైన నీవకర్ణదనము మోహముసకు।ననబోణియొప్పునీకను గుణ్యమై ॥ వనజాక్షి ॥ ౧౧ ॥

కృ॥ యీయిందుముఖిపొందుమీ।యందరకునిందు।న్యాయమైతో చినదీయికనూ। శ్రీయుతముగదీని చేపట్టెదనునింక।ధియుత మంగళాదీ సుకృప॥యీయిందు ॥ ౧౨ ॥

శ్రీ కృష్ణని కందార్థం.

నీయెడ నే సోనములే।దియ్యెడ కాలగతిదప్ప దేరికినైనం।జయ్యనసీస్తో త్రింబున। నెయ్యముడావాటించెమడికిశ నెనరుదయించెగా॥నీపల్కులు।ఘ నముజనించెగా॥ మనము యీసత్యభా।మనుజూచి సమ్మోద। మునుజెం దెదీననీ।వనిన కలతదీరే॥ వనజలోచనుడైననరహరి।మనమునసంతస ముజెందెను। గనుక నాదు మనోరథంబిది। కార్యముగాగను ఫలించె ను॥ నెనరుదయించెన్॥

కృ॥ వ॥ నీభావంబేవిధంబైనదోషంబుజెందదు। నీవిచ్చిన యీవని తామణిని వేవిధంబులగుకానుకగా గైకొంటిమి। గావున నెమ్మదినుం డుమా సత్రాజిత్తా॥

సం॥ వ॥ అని యపరిమితానందభరితాంతఃకరుణుండై కృష్ణుండా నతిచ్చిన। యనంతరంబ॥

సంధి॥ ద్వి॥ గర్గాదిఋషులెల్లగైచేసిబంధు।వర్గంబులునుమంత్రి వరులుపౌరులును।స్వామికిమంగళస్నానమొనర్చి। హేమవస్త్రవిభూ షహితగంధమాల్య।స్తోమాభిరామసంశోభితు జేసి। సామగానంబులు సద్విజుల్ సల్ప। కళ్యాణవేదిపైకమలాక్షునిల్పి। మాల్యాక్షతులునూ త్నమధుపర్కములును। చూతపల్లవయలు సుచిరవాక్తి। కాతతు ల్గానివచ్చికడువేడ్కతోడ। సంకల్పవిధినప్డు సత్రాజితుండు। పంకజా క్షునకు మధుపర్కమొసంగె।కన్యావరణలధికంబుగానిచ్చె।ధన్యగా జేసిత న్దయజూడుమనుచు। కన్యకామణియునుగౌరిపూజించె। ధన్యత గొనవ చ్చితద్వేదిజేర్చె।కన్యాలలామమమార్కండేయుడపుడు। పుణ్యపురంధ్రి

లుప్పొంగుచుజూడ। భేరిదుందుభులు గంభీరమై మోఁయ। వారవధూజన వర్గంబులాడ। భద్రికాహళములు బహళతూర్యములు। రుద్రవీణాధ్వనుల్ రోదసినిండ। బలభద్రసాత్యకిప్రముఖులుతోడ। కలసియాదవులెల్లకడుసంభ్రమింప।నారదాదులుమింట నలినాక్షుయనుచు। చేరిసంకీర్తన సేయుచుండగను।మానుగవరవధూమధ్యభాగమున।మానితముగుచేలమటతెరవైది।పూనిభోజునకునప్రిందనుశూర। సేనుప్రాచ్యిందునుశ్రీకరుండైన। ఆనకదుందుభికాత్మజుండైన। శ్రీనివాసాఖ్యభాసిలుచున్నయట్టి। పూనిశ్రీకృష్ణునిపొందుగాజేరి। దానసీలుండుసత్రాజిత్తుడపుడు। మానినిలలితాంగిమంగళకలశ।మూనిపుణ్యోదకంబులువంపపెంపు। మీరగంగనుగన్న మేటిపాదములు। సారంపుభక్తిచేసయ్యన గడిగి।కూరిమినవమిత్రిగొనబగునప్రీ।చారునిమ్మునిపాతిసరసుడైనట్టి। సత్రాజితునిపుత్రిసత్యాలలామ।మిత్రసందీప్తులమెరయుకరంబు। సరగునశౌరిచేసంధిల్ల జేసి। సురపుష్పవృష్టి సంశోభిల్లగాను। సాలంకృతముగనాసఖదారవోసె। శ్రీలీలమణితోడ శ్రీకృష్ణునకును॥

సంధిదరువు - కాంభోదిరాగం - ఆదితాళం.

ప॥ పరిణయమయ్యెనుగా। శ్రీకృష్ణుడుసత్య। భామను ప్రేమమీరగా॥ నరహరియగునా।నలినాక్షుడుతన। కరమునపాణి। గ్రహణముజేసియు॥ ప॥ సతిపతులు దోసిళ్లను। తలబ్రాలుగొని।యతిమోదమునజల్లను। హితమతిచేతను హెచ్చిజూచుచును।వితతమోహముల వేడుకలలరగ॥ప॥౧॥ సప్తపదములుద్రొక్కగ। రుక్మిణీముఖ్య।సతివర్గములుజూడగా।దీప్తులడరదివి దివిజులు బొగడగ। తృప్తులైబుధులూ దీవెనలొసగగ॥ ప॥ ౨॥ రాజాధిరాజులెల్లను। నరహరికరుణా। రమణీయ్యగతులావల్లను। భ్రాజమానులైప్రబలగగర్గుడు।లాజహోమములజేలంగుచుజేయగా॥ పరిణయమయ్యెనుగా ॥ పరి ॥ ౩ ॥

* సుభద్ర మంగళహారతి - ఖమాచీరాగం - ఆదితాళం. *

ప॥ మాంగళ్యమానీబాడరే। అంగనలారా। మాంగాళహారతివ్వరే॥ చ॥ సంగతిగనుజలదాంగుడైనయదు। పుంగవునకు। సత్యాంగనకు

నుశుభ॥ మాం॥ శృంగారరసములుప్పొంగ।కర్పూరహారతి।బంగారు పాత్రలజెలంగ।రంగుమీరగను గంగాధరవరు। సంగడీకిసత్యాంగనకు నుశుభ॥ మాం॥ ౧॥ పరమాకృపావమానకు। మురహరూనకు।గరుడగమనునకు। సరసిజాక్షుకరివరదుడైనశ్రీ। నరహరికినిసరసిజో దరునకును॥ మాం॥ ౨॥ మనసిజోద్భవునకు।జనకుడైన। మునినుత చరణునకు।ఘనకిరీటహారనూపురాంగద।కటకవలయ। ధారుడైనశౌరికి॥ మాంగాళమనిబాడరే॥ ౩॥

సంధి॥ వ॥ తదనంతరంబున సత్యభామను జననీజనకులు తోడ్కొనివచ్చి యామెచేతులను పాలను।నేతనుతడిపి। యత్తవారికి నప్పగించువిధంబెట్టులనిన॥

* అప్పగింతలపాట - హాయిరిరాగం - అటతాళం. *

స॥ కలకంఠియిదిగో ల-కరుణాలవాలా। అలుకసేయకబాలా- అరయుమీలీలా। పనులేమినేరదిభామగోపాలా। కనకరంబునదీనిగావుమేవేళా।పసిబిడ్డదీనియేపగిదిబ్రోచెదవో। అసమాస్త్రజనకానీయదిభారమయ్యా॥

సంధి॥ యనుచుకృష్ణునిచేతికందించియపుడూ। ఘనముగా దేవకీకాంతతోననిరి॥ లలి॥ వనజాక్షినీపుత్రివలెజూచుకొమ్మీ। అనిశంబునీబాలనానందాశీలా॥ స॥ వసుదేవదేవయీవనజాతనేత్రీ। పసిబాలకరుణాతోపాలింపవయ్యా।బలభద్రయీసత్యభామాలలామా।కలకంఠియిదిదీనికరుణాచేబ్రోవూ॥ ల॥ బ్రోవవేయీయింతిరేవతీకాంతా।నీవునుక్షణిరావె నెలతచెయ్యంచా। సఖియరుక్మిణినీదు సవతియీయువతీ। సఖ్యంబుగాబ్రోచిపాకవేసుదతీ।భద్రంబుగానోసుభద్రాలలామా।భద్రభయానాయీభామినీబ్రోవూ॥సంధి॥ అనివారలకునెల్లనటులప్పగించి। వినతులైరటువారు వేడ్కసంధిల్లా॥

సం॥వ॥ ఇట్లు శ్రీకృష్ణుండు సత్యభామను వరించి మించి సత్రాజిత్తుంగాంచి॥

కృ॥ గీ॥ సత్యభామనొసంగితిచాలుమామ। మణులనేకంబులున్న

వీమణినినీవు। దినకరునిచాలమెప్పించిదెచ్చుకొంటి। గానినీతావునసెదీని గాచుకొమ్మీ॥

కృ॥ వ॥ నీవిచ్చినయీవధూమణిమాకుచాలును। నీమణిని మరలగ్రహించుమా మామా॥

సం॥ వ॥ అనిన సత్రాజిత్తు శ్రీకృష్ణునభినుతించు క్రమం బెట్టిదనిన॥

* సత్రాజిత్తుదరువు - శ్రీరంజనిరాగం - ఝంపతాళం. *

ప॥ శ్రీరమాధినాయకా। చింతితఫలదాయకా॥ శ్రీ॥ నారదనుత భవ్యరుచిర। నవ్యపుష్ప సాయకా।ద్వారకాపురాధిపా। ధీరరక్షితద్విపా।సారపాతుసత్కృపా।నీరదాకార। శృంగార।శోభాకరా॥ ఝం। తతాధిందతాం। తకాతకా।తద్ఝుణుత। తద్ధిమిత తగ్గధిత దధిగిణత॥ శ్రీ॥ ౧॥ రాధికామనోహరా। రమ్యసుగుణశేఖరా। నాధచరణకలిత లలిత। నాకసింధుసీకరా॥ క్రోధియూధభీకరా। ఘోరకలుష సంహరా। మాధవజగదీశ్వరా। మంగళాద్రి। వరోత్తుంగ। శృంగాటక॥ శ్రీ॥ ౨॥

వ॥ ఇట్లు సత్రాజిత్తు శ్రీకృష్ణుని వినుతించుచుండ పుత్రీకారత్నంబు నుంజూచి లలితాంగియిట్లనియె॥

* లలితాంగిదరువు * శింధుభైరవిరాగం - ఆదితాళం *

వ॥ భామనీదు భాగ్యమహిమ। యేమనందునిమ్మహి॥ భామా॥ ఉ॥ రామానీమోముఫలము। రమణులందుగనము। వినము॥ భామ॥ జలజనయనుకరుణనీదు। వలనమాకుగలిగెగా। కలికిచిన్నికూనననన్ను గన్నపుణ్యమెన్నదరమే॥ భా॥ ౧॥ పావనిమనవంశమునకు। బాగుమీరవన్నెదెచ్చి।నీవతిపతిభక్తిగల్గి। నిరుపమానముగ సుఖంపు॥ భా॥ ౨॥ అత్తమామలందునకడు। బత్తిగలిగిమేలుగాంచి।పొత్తుపొసగమెలగుసవతి। చిత్తమరసి కలసిమెలసి॥ భా॥ ౩॥ వరుడుఅన్యసతసిగూడ।వంతనొందిచింతగొనక। మంతనమునసంతసిల్లు।మంగళగిరిహరినిదలచి॥ భా॥ ౪॥

సంధి॥ వ॥ అనంతరము సత్రాజిత్తు శ్రీకృష్ణు ననుజ్ఞగొను విధంబెట్టులనిన॥

*సత్రాజిత్తురెట్టింపుదరువు-కమలామనోహరి రాగం-ఆదితాళం.*

ప॥ దయజూడుమా। శ్రీకృష్ణనా॥ద॥ ధరనునీపై నిందాపరచితినని

మది। నరమురసేయకు। మా_త్రరక్షక ॥ ద ॥ ఉ ॥ కడలాడాననుకనిక రమున॥ దయజూడు ॥చ॥జలజనయనని మా।పలుమరు వేడగ।నలవియగు నె యలయకురులకను॥ దయ ॥ ౨ ॥ శరణు మంగళగిరివరలక్ష్మీనరహరి। కరుణజూడుము నేనరగివచ్చెద ॥ దయ ॥ ౩ ॥

స॥ వ॥ ప్రజ్ఞానఘునా జనివచ్చెద నాజ్ఞదయజేయుమా॥

కృ॥ వ॥ మహామంచిది మామ॥

సం॥ వ॥ తదనంతరంబున లలితాంగి రుక్మిణీప్రముఖులంగనుంగొ ని గొనియాడువిధం బెటువలెను॥

యాలలు॥ కావవేకారుణాతోను।బ్రోవవే।భామానునీదు భావము నసుభద్రికైవాడీ। దేవాకీదేవి భావము ॥ ౧ ॥ తోటిబోటూలాతో గూ డీ। ఆటాలాడూచుండూగాగ। మాటలైనాకురి నేరదన్నా। దేవకీదేవి॥మా టలై ॥ ౨ ॥ పల్లావాపాణీరో డనితల్లీదండూ)లుమీా రేను। మెల్లపనుల నెరుగానేర్పూవమా।దేవకీదేవీ ॥ మెల్ల ॥ ౩ ॥ చంద్రబింబానానానీదు। చెల్లెలవు సత్యాభామానూ।కుందరదనాకృపతో బ్రోవావే। రేవాతికాం తా॥కుందర ॥ సార్వాభౌమూడాశ్రీహరి । సత్య ప్రసన్నజనివచ్చెద।స రసిజాక్షిని। కరుణాజూడూమా। రేవాతీకాంతా॥ సరసి॥ ౫ ॥

* లలితాంగిదర్వు - నాటరాగం - ఆదితాళం. *

ప॥ కృపాశాలిశ్రీరుక్మిణీ। తల్లి దీనిగావవే ॥కృ ॥ ఉ॥ నీపాలనీ। బా లనీ।లీలనీ।బ్రాపొందె నేపగిది।బ్రోచెదో ॥ కృ ॥ సిరుల్సరుల్ విరుల్ మ ఖుల్ । శ్రీకరవరి మెళచందనములే ।నెరవరినీవలె।ధరింపనీ।తలిరులబో ణికి।గరవుమింపుగ। మెరసిసొంపుగ।వరుసప్రాణేశ్వరునిసన్నిధి ॥ కృ ॥ ౧॥ కళావతుల్ ।పురాంగనల్ । బళా రెయనితమభావములకు।విలాసినీల లామ। మీా। కులాచారశుభగణగుణముల్ । మేలుగాగని మెచ్చగాపటు సీలతకా లోలతనైలగుడు॥ కృ ॥ ౨ ॥ కృశోదరీనీకుసోదరీ। శశాంకము ఖి।మంజులాధరీ।వశీకరీ।పతికిశ్రీరవ ణవరుని మంగళగిరినరహరికి। విశ దవైభవమొసగవేడక నీ।కుశలివైగొలచులీలగరవుము ॥ కృ ॥ ౩ ॥

సం॥ వ॥ లలితాంగినగని దేవకీదేవిప్రముఖులిట్లనిరి॥

దే॥ వ॥ లలితాంగి నీలతాంగికేమియుం గొదువలేమ నీయంత
రంగంబున చింతమాని సుఖంబుండుమా॥

సం॥ వ॥ ఇట్లు సత్రాజిత్తు భార్యాసమేతుండై సెలవుతీసుకొని వె
ళ్లినపిమ్మట పదునారువేల నూటయెనమండ్రు భార్యలుగొలువ వార
లతో ననుపమానందరసాబ్ధి నోలలాడుచున్ శ్రీకృష్ణుడనుపమానసం
సారిన్నై సుఖంబుండె నెట్టులనిన॥

* సంధిదర్వు - పూరిరాగం - ఆదితాళం. *

ప॥ కలువలచెలి చెలి। చెలువుడుసలిపెను।కులసతుల రతులతులగ
తుల॥ చ॥ తొలితనువలసిన। యలసురలలనలు। కలితలలితగజ। గామి
నులై కామినులై।భామినులై। గొల్వగ॥కలు॥ శ్రీరమణియవి।చిత్రిమ
నోహరా।కారవిలాసవి।హారముల।ఆరమణీమణు। లభినవకళలరు।వా
రగకోర్కులు।మీరగ।తనుజేరగ।తమిదీరగ॥ కలు ॥ ౧ ॥ లీలనసమసుమ
కేళితల్పముల।మేలగుచంద్రికాశాలికల।బాళిచెటులవన। పాళులనీళల।
హాళిరత్నమయ।హాటకవిట।నాటకపటు।వాటికలను ॥ కలు ॥ ౨ ॥ తుం
గళగిరిహరీ।అంగనలకుసరి।రంగులమెరయుల।తాంగులను।అంగరంగవి
భ।వాతిశయవిజయ।సంగతులకలసి।పొంగుచు। బహుభంగుల। గరగింపు
చూ॥ కలు ॥ ౩ ॥

సం॥ వ॥ ఇట్లు శౌనకాది మహర్షులకు సూతుండుచెప్పెను॥

* కృతినాయకుని మంగళహారతి - సురటరాగం - అటతాళం. *

ప॥ కర్పూరహారతివ్వరే।నృశింహ్వాలకు। (లక్ష్మీపతికి) । ఘనభక్తితో
మొక్కరే ॥ చ ॥ కర్పూరహారతి।కందర్పజనకునకు। నర్పించిగొనియా
డియనువుగబాడరే॥ క ॥ సకలవిభవములను। మంగళగిరి।స్వామిగనిజా
డగను। ఆకుటిలప్రిభలచే।నజహరాదిదేవా।నికరముగొల్వగనెగడిననర
హరికి॥ క ॥ ౧ ॥ హైరణ్యకశ్యపుజంపి।ప్రిహ్లాదుని యానందగతనినింపి।
పారమైనయట్టి।సారూప్యమొసగియా।ధారుణీరాజ్యము।దయనొసంగి
నహరికి ॥ క ॥ ౨ ॥ జనముపానకమర్పింప।నందర్ధముగొని దాసులు గ
ణింప।గనుమహిమనువగ।అనయము లోకము। లనుపాలింపుచున్న।

వనజనాభునకు ॥ క ॥ ౩ ॥ గుండద్వైతబ్రహ్మసుకవి। నాటకము । ఖండమతినర్పింప।దండిమీరగనా।ఖండలాదిసురుల।తండముల్ పువ్వుల నిండు వర్షముగురిసె॥ క ॥ ౪ ॥

కం॥ ఈనాటకముంజదివిన। యానరులకు మోక్షపదవి యతిసుల భమగుఁ।బూనిననిందలు దొలగున్। మానితవిభవంబులందిమనుదురు ధరలోఁ॥

వ॥ ఇది శ్రీలక్ష్మీనృసింహ వరప్రసాద లబ్ధసహజ పాండిత్యసంగీతసాహిత్యకోవిదుండైన గుండద్వైత బ్రహ్మశాస్త్రి వరుచే రచింపబడినసత్రాజిత్తు।సూర్యుంగూర్చి తపస్సుచేసి। శమంతకమణిని బడయుటయు। సత్యభామజననంబును । మణిని నుగ్రసేనమహారాజునకు నిమ్మని కృష్ణుండడుగుటయు, ప్రసేనుడుమణికంఠమందు దాల్చివేటకై వెడలి అడవియందు హతుడవుటయు। సత్రాజిత్తుకృష్ణునిపై నిందవేయుటయు। కృష్ణుడపవాదనివారణార్థమై । జాంబవంతునితో బోరిజయించి।యాతనికూతుని మణిసిగొనివచ్చుటయు। సత్రాజిత్తునకుమణినిచ్చుటయు । సత్రాజిత్తుపశ్చాత్తాపచిత్తుండై।సత్యభామను శ్రీకృష్ణునకు నొసగుటయు। నాదిగాగల శ్రీకృష్ణసత్యభామాపరిణయంబను। సత్రాజిత్తునాటకంబు॥

సంపూర్ణంబు.

—⟨ శ్రీలక్ష్మీనృసింహార్పణమస్తు. ⟩—

